



# ఔత్సాహిక పాదాలకు సర్వకాలరక్ష



| | | |
|---|---|---|
| జయింట్స్ | 11 & 12 | రూ. 11.95 |
| మగవారివి | 7 – 10 | రూ. 11.50 |
| ఆడవారివి | 2 – 6 | రూ. 10.50 |
| పిల్లలవి | 9 – 1 | రూ. 7.50 |
| శిశువులవి | 6 – 8 | రూ. 6.50 |

స్థానిక పన్నులు అదనము

# TROT®
# కుషన్

కలకాలమూఉండే పాదసౌకర్యము

ట్రాట్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు స్వంతదారులు:
ట్రాట్ షూ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
19/4A మున్షీగంజ్ రోడ్
కిద్దర్‌పూర్, కలకత్తా 700 023

సుప్రసిద్ధ "హవాయి" స్లిప్పర్స్
తయారీలో ఇండియా నిపుణులు
DRP
డైనమిక్ రబ్బర్ & ప్లాస్టిక్ ప్రైవేట్ లిమిటెడ్
వైట్‌ఫీల్డ్ రోడ్, మహాదేవపుర పోస్ట్
బెంగళూరు 560 048

Grant. DRP. 8 Tel

# ఉచితం!!

## మీ అభిమాన మాస పత్రిక రేపు అందిస్తున్న ఈ సుందరమైన నూతన సంవత్సర కానుకను ఉచితంగా స్వీకరించండి!

● మీరు చందాదారులుగా చేరదలిస్తే ఈ క్రింది కూపనును పూర్తి చేసి పంపించండి. లేదా కార్డుపై మీ చిరునామాను వ్రాసి మాకు పోస్టు చేయండి.

● పోస్టు,ప్యాకింగు ఖర్చులు మేమే భరించి మీకు దాదాపు రూ. 10/- విలువగల ఈ డైరీని ఉచితంగా వి. పి. పి. ద్వారా పంపిస్తాము.

● వి. పి. పి. తెచ్చిన పోస్టుమాన్‌కు 'రేపు' చందా నిమిత్తం రూ. 25/- చెల్లించండి. ఆ తరువాత 'రేపు' మాసపత్రికను మీకు సంవత్సరం పాటు పంపిస్తాము.



**మీరు ఈ క్రింది కూపనును పూర్తిచేసి పంపితే చాలు**



ఇక్కడ కత్తిరించండి

నేను రేపు మాసపత్రికకు చందాదారుడిగా చేరగోరుచున్నాను. ఈ సుందరమైన డైరీని ఉచితంగా వి. పి. పి. ద్వారా పంపించండి. వి. పి. పి తెచ్చిన పోస్టుమాన్‌కు రూ. 25/- చెల్లించగలను. 'రేపు' మాసపత్రికను సంవత్సరంపాటు ఈ క్రింది అడ్రసుకు పంపండి.

పేరు ____________________

చిరునామా ____________________

____________________

____________________

సంతకం ____________________

ఇక్కడ కత్తిరించండి

అద్భుతమైన మాస పత్రిక 'రేపు' ఇప్పటికే లక్షలాదిమంది జీవితాల్ని ఉన్నతంగా తీర్చి దిద్దింది. ఒక్క సంవత్సరంలో మీకు నూతన జీవితాన్ని వాగ్దానం చేస్తోంది.




'రేపు' మాసపత్రిక, ఏలూరు రోడ్డు, విజయవాడ.

లోకం పోకడ — ఊర్మెన్





**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాధుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938—1972]

శుక్రవారం : 11–1–'80

సిద్ధార్థినామ సం. పుష్య బ. నవమి

**సంపుటము 73 : సంచిక 20**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ-520 003


# విషయానుక్రమణిక



పాఠకులకు కొత్త ఏడాది

శుభాకాంక్షలు ! సం॥

# మూఢనమ్మకం !

ప్లాస్టిక్ గాజులు వేసుకుంటే ఆయుర్దాయం తక్కువ అవుతుందనీ, పెళ్ళి కానివారు వేసుకుంటే మంచి మగడు రానే రాడనీ బొంబాయి నగరంలో ఓ విధమయిన నమ్మకం, మూఢ నమ్మకం పుట్టించారెవరో. దాంతో ప్లాస్టిక్ గాజుల గిరాకీ తగ్గి గాజు గాజులమీద అంగనలు విరుచుకపడుతున్నారట. అసలే గాజు గాజులు కదా అలా విరుచుకు పడితే విరిగిపోవూ!!

# రైలంటే తెలీదు !

మధ్యప్రదేశ్‌లోని సర్గూజా జిల్లాకు చెందిన ఒకటింపావు మిలియను జనంలో సుమారు ఒక మిలియను జనం యింకా రైలును చూడని వారున్నారట. భారతదేశంలో రైలు పుట్టి నూటపాతికేళ్ళయినా యీ ప్రాంతంలోని పది లక్షల మంది ఇంకా నిజం రైలు చూడలేదట. సినిమాల్లోనూ, పత్రికల్లోనూ బొమ్మలు చూశారట కొందరు.

### టీ త్రాగుతూ పదిహేనేళ్లు !

షికార్పూరుకు చెందిన ఓ గ్రామంలో 50 ఏళ్ళ శివమ్మ అనే ఆవిడ గత 15 సంవత్సరాలుగా కేవలం రోజుకి కొన్ని కప్పుల టీ మాత్రమే త్రాగుతూ చాలా ఆరోగ్యంగా హాయిగా వుంటోందట. టీతప్ప (నీళ్లు కూడ త్రాగుతుందట) యిహ ఏ యితర పదార్థం గానీ, ఫలాహారం గానీ గత15 ఏళ్ళుగా తీసుకోని యీ ఆవిడ మంచి



ఆరోగ్యంగా తన పనులు చేసుకుంటుందట. ఆరోగ్య పరీక్ష చేయించుకోడానికి ఆవిడ ప్రభుత్వాసుపత్రికి వస్తే, అక్కడ డాక్టర్ల ప్రశ్నల్లో యీ విషయం బయట పడ్డదట.

### కెన్యా ఎం. పి. గా భారతీయుని గెలుపు !

కెన్యా పార్లమెంటుకు భారత దేశీయుడైన కృష్ణగోపాలు పోటీ చేసి పటిరాపటిరా అనే ఆయనను పదిహేనొందల డబ్బయ్యైదువోట్ల మెజారిటీతో గెలిచి రికార్డు సృష్టించాడట. ఆయన ఆ దేశంలో స్థిరపడిన వ్యాపారిట.

### హోటళ్ళలో అమ్మాయిల అరెస్టు

వ్యభిచార నిర్మూలనా చర్యలో సేలం పోలీసులు పూనిలో చేసిన సోదాలలో ఒకహోటల్లో ఓ రహస్య ఎయిర్‌కండిషను గదిలో పళనియమ్మ, సరసు, రాణి, జయంతి, పళనియమ్మాళ్, అనే అయిదుగురు ఇరవై, ఇరవై రెండేళ్ళ వయస్సు లోపు అమ్మాయిలు కొంతమంది మగాళ్ళతో దొరికారట. మరో హోటల్లోని వసంత, రాధిక, విజయ అనే మరో ముగ్గురు సుందరాంగులు దొరికారట.

### మేకల దొంగ ?

పాలకోడుకు చెందిన పత్తూర్‌పట్టి గ్రామంలో పెరుమాళ్ అనే అతని మేకల మందలోని మేకలను దొంగిలించడానికి ఎవరో మొన్న 26 వ తేదీరాత్రి ప్రవేశించే సరికి పసిగట్టి అతను దొంగ దొంగ అని కేకలేశాడట. దాంతో ఆ దొంగ పారిపోయాడట. ఈ పని పక్క గ్రామానికి చెందిన మాణిక్యం పనే అని నిర్ధారించుకుని రాత్రికి రాత్రే పోలీసు మంది అనుయాయులతో బయల్దేరి అతనింటికి వెళ్ళి మాణిక్యం యింట్లో ఆసమయంలో లేక పోవడంతో అతని భార్య ముందు నానామాటలూ అనేసి వచ్చేశాడట. కాస్త ఆలస్యంగా ఇంటికి వచ్చిన మాణిక్యం భార్య ద్వారా యీ విషయం విని కోపంతో నాటుతుపాకీతీసుకుని అర్ధరాత్రి బయలుదేరి ఆ వూరు వెళ్ళి అనుయాయులమధ్య కూర్చుని మాట్లాడుతున్న పెరుమాళ్ళను కాల్చిచంపేశాడట.

### విరిగిన మనస్సుతో ఉరేసుకున్న భర్త !

సేలం అన్నవట్టికి చెందిన కొల్లాంపట్టిలో 21 ఏళ్ళ తంగవేలు భార్య 17 ఏళ్ళ సరోజకు పచ్చ కామెర్లు వచ్చి పుట్టింటికి వెళ్ళిందట. తంగవేలు రోజూ ఆమె వద్దకువెళ్ళి ఇంటికిపోదాం పద రోగం నయం కాడానికి మీవాళ్ళింటికి రావాలా అని పిలుస్తూ యుండేవాడట. రోగం తగ్గాకవస్తాను. నాకక్కడ చూసేవాళ్లెవరు అని ఆమె నిక్కచ్చిగా చెప్పడంతో మూడేళ్ళకాపురం చేసిన భార్య తనమాట విననందువల్ల, తనను గౌరవించనందువల్లా మనస్సు విరిగి, ఆదే విషయం ఓ వుత్తరంలో రాసి, వురిపోసుకు చనిపోయాడట.

బొంబాయి టెస్ట్‌లో గెలుపు

# మన క్రికెట్ కుర్రాళ్ళకి జేజేలు!

తల్లక్రిందులా తపస్సు చేసి మరీ సాధించాం విజయం అంటున్నట్లున్న కర్సాన్ ఘావ్రి



"లక్కీ గవ్వీ..."

గురువారం సాయంకాలం ఇక్బాల్ కాశిమ్ బ్యాటింగ్ చేస్తున్నప్పుడు అతని 'ట్రవుజర్' చిరిగిపోయింది. లేకపోతే ఇంకో గంట ముందే దేశంలోని లక్షలాది క్రికెట్ క్రీడాభిమానులు- జయ జయ ధ్వానాలతో పాకిస్తాన్ మీద మనవాళ్ళు తీసుకున్న గెలుపును సంబరాలతో కేరింతలతో చేసుకునేవారు!

—పాకిస్తానువాళ్ళు వచ్చి 'చిత్తు' చేస్తారు మనల్ని, అన్న భయం గవాస్కర్‌కి కూడా పోయింది! మనవాళ్ళు "జిడ్డు మారాజులు", సొంత ప్రతిష్ట కోసం 'సెంచరీలు' కొడతారేగాని 'గెలుపు' సాధించలేరన్న చెడ్డపేరూ పోయింది.

—ఇండియన్ బ్యాటింగ్ గవాస్కర్‌తో ఆరంభిస్తే విశ్వనాధ్‌తో అంతమవుతుంది— అన్న మాట కూడా యిప్పుడు లేదు!

—ఒక రకంగా పాకిస్తాన్ జట్టు నాయకుడు ఆసిఫ్ యిక్బాల్‌కి థాంక్సు చెప్పాలి! క్రికెట్, గెల్వడానికి ఆడాలేగాని రికార్డుల కోసం కాదు అన్నాడతను. ఓడిపోయే దశలో కూడా ఆ మాట నిలబెట్టుకుని, మనవాళకి వికెట్ల మధ్య పరిగెత్తాలన్న సంగతి బాగా నేర్పించాడు!

—గురువారం (డిసెంబరు 20) మధ్యాన్నం ఒక దశలో 522 నిమిషాల్లో 322 పరుగులు చేయవలసి వున్నప్పుడు— ఆ ఉదయమే, మన "జిడ్డుమాష్టర్ల" మీద యిక్బాల్ కాశిమ్ "స్పిన్నర్" అను నిప్పుల బంతుల్లాగ విసిరి 12 పరుగులకి 5 వికెట్‌లు లాక్కున్న వైనం తెలిసి కూడా— "ఆసిఫ్ మియాఁ" "జావేద్ మియాఁ" లు నిమిషానికో పరుగు చొప్పున మైదానం ముట్టూరా బంతుల్ని ఘాతుకుతూ-తియ్యడం చూస్తే 'టెస్ట్ మ్యాచ్'కి నాలుగు రోజులు చాలు నవిపించింది! ("పాక్" టీమ్‌ని మెచ్చాలి యిక్కడ.)

## అసలు "ఘావ్రి" లాఘవం చూడాలి!

"ఆసిఫ్" గారు పిచ్ మంచిది కాదని కోప్పడ్డం తప్పే కాని కలలో కూడా యిట్లాంటి "పిచ్" వుంటుందని మన స్పిన్నర్‌లు కూడా అనుకోనుండరు! ... ఘావ్రి విడం చేతో ప్రపంచ ప్రఖ్యాతి పొందిన బ్యాట్స్‌మన్‌ని విడిపించేశాడు! (18 ఓవర్లు 4 వికెట్‌లు) (2-0) తో పాకిస్తాన్‌లో సీరీస్ వదులుకున్న మనవాళ్ళు "ఇండియాకి వచ్చి యిండియాని గెల్వడం "సాధ్యం కాదన్న" సంగతిని రుజూచేశారు. "మన గవ్వీ, లక్కీబోయ్!" ఆస్ట్రేలియా మీద, అంతకు ముందు వెస్టిండీజ్ మీద గెల్చిన ఘనత దక్కించుకున్నాడు — యిప్పుడు పాకిస్తాన్‌ని కూడా "తోసిరాజు" అన్నాడు! (సారీ! వెంకట్!! గవాస్కర్ ఇంగ్లాండ్‌కి "కాప్టన్"గా వెళ్ళివుంటే ... నీకూ యీ ఛాన్సు ఉండేది.)

—"ఇంకా 3 టెస్ట్‌లున్నాయి." అని హెచ్చరించాడు పాక్ స్కిప్పర్! ఔను! యికమీదట "వీరు బాగా ఆడుతున్నారు"



అంటే "కామెంట్రీ చెప్పేవాళ్ళే బాగా ఆడుతున్నారు" అని జోక్ చెయ్యనక్కరేదు. గనుక ఆరు టెస్ట్‌లున్నా 'వర్రీ' లేదు. మన కుర్రాళ్ళు బాగా ఆడతారు! భళా!

—వీరాజీ

---

### కోడలుకీ లివర్‌కీ సంబంధం?

హార్దోయ్‌జిల్లాకు చెందిన ఒకవూరిలో ఒకావిడ కోడలు తప్పిపోయిందట. ఆమె ఒక మాంత్రికుణ్ణి కలిసికొంటే ఆ మాంత్రికుడు ఓ చిన్నపిల్ల పొట్ట చీల్చి లివరును తెచ్చిస్తే, దానితో పూజచేసి ఆమె కోడలును ఎక్కడున్నా రప్పించగలనన్నాడట. దాంతో ఆ మహాతల్లి దారికాసి, ఓ ఎనిమిదేళ్ల పిల్లను ఏమార్చి, చంపి, పొట్టచీల్చి, లివరుతీసి పట్టుకెళ్ళి ఆ మాంత్రికునకిచ్చిందట.

### కొడుకు మరణం తల్లి ఆత్మత్యాగం!

మళయాళనటుడు నజీర్‌ను అనుకొని ఓ పరిస్థితిలో కొందరు అతను దొంగని భ్రమపడి చీకటి చాటున చావబాది, చంపేశారట. ఈ విషయం తెలిసిన ఆతనితల్లి లబ్బున ఏడుస్తూ నేనూ ప్రాణం వదిలేస్తున్నాను, నన్నూ నా కొడుకుపక్కనే పాతిపెట్టండి అని చెప్పి మరీ చనిపోయిందట.

### కొడవలి వాతలు!

ఏలూరుతాలూకా మేదినరావుపాలెం అనేవూరులో నిక్కలపూడి సుబ్బారావు అనే ఓ భామందు దగ్గర కుటుంబరావనే 16 ఏళ్ల కుర్రాడు పని చేస్తున్నాడట. తమ బంధువుల అమ్మాయితో అతను అసభ్యంగా ప్రవర్తించాడని అతన్ని గొడ్లపాకలో పెడరెక్కలు విరిచికట్టి, కొడవలిని ఎర్రగాకాల్చి ఒంటిమీద వాతలు పెట్టారట. ఆ కుర్రాడు యీ విషయాన్ని జిల్లా కలెక్టరుకు విన్నవించుకున్నాడట.

సాయంత్రం అయిదుగంటలయింది.

స్కూలునుండి అప్పుడే ఇంటికి వచ్చాడు రాజారావు.

"లలితా నాకు త్వరగా మంచినీళ్ళు, ఆ తర్వాత కొంచెం కాఫీ ఇచ్చి త్వరగా తయారవు గుడికి వెళ్ళివద్దాం. పద్మ రాము ఏరీ" అని అడిగాడు.

మంచినీళ్ళగ్లాసు అందిస్తూ "పద్మ వాళ్ళ స్నేహితురాలి దగ్గరకు నోట్సుకోసం వెళ్ళింది. ఇక రాముకు సాయంత్రమైతే ఆటలేకనా బయటకు వెళ్ళాడు." అని చెప్పింది.

పన్నెండు సంవత్సరాల పద్మ పదేళ్ళ రాము, లలితా రాజారావుల సంతానం.

కాఫీ కలిపి ఇవ్వటానికి వంటగదిలోకి వెళ్ళింది లలిత.

"ఇంతలో స్నానంచేసి వస్తా"నంటూ తువాలు తీసుకుని బట్టలు మార్చుకో బోతున్నాడు.

ఏదో కారు ఆగిన శబ్దం అయితే వీధి వైపు చూశాడు. ఒక అంబాసిడర్ కారు ఆగింది.

"ఎవరబ్బా ఈ వేళప్పుడు ఇక్కడకు కారులో వచ్చేది. ఎవరి ఇల్లయినా తెలియక వచ్చారేమో" అనుకుంటూ బయటకు వచ్చాడు.

ఇద్దరు మనుషులు కారులో నుండి దిగి లోపలకు వస్తున్నారు. అందులోఒకాయనను ఎప్పుడో చూసినట్లున్నది. వాళ్ళ అబ్బాయి సీటు కోసం వచ్చి వుంటాడు.

మరి ఇప్పుడూ అందుకేనా—ఇది ఆ సీజను కాదుకదా? అనుకుంటున్నాడు.

"నమస్కారం మాస్టారూ! మీరు ఇంట్లోనే వుండటం మా అదృష్టం" అని ఆ ముఖ పరిచయస్తుడు అంటూ వుంటే 'ఎక్కడికైనా పారిపోయావను కున్నాడా' అని నవ్వుకున్నాడు.

ప్రతినమస్కారం చేస్తూ అక్కడున్న రెండు కుర్చీలలో వారిద్దరినీ కూచోమని చెప్పి, తాను మంచం వాల్చుకుని కూచున్నాడు.

పత్నికొచ్చి ముంత దాచటం ఎందుకన్నట్లుగా ముఖపరిచయస్థుడు ముకుందరావు సంభాషణ మొదలు పెట్టాడు.

"మీతో పని వున్నది మాస్టారూ! మీరు వెంటనే మాతో బయలుదేరి రావాలి"

# టీచర్సుడే

గంగరాజు కృష్ణకుమారి

అదేమిటో అంతుపట్టక ఆశ్చర్యపోతున్నాడు రాజారావు. "ఏమిటీ? ఏదయినా వ్యవహారంలో సాక్ష్యమివ్వాలా కొంపతీసి. అసలే రోజులు బాగాలేవు. బడిపంతులు జీవితమే దినగండంగా వున్నది" అతని ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి.

తర్వాత వారు తెల్పిన సారాంశం ఇది. వీళ్లిద్దరూ ఒక సాంఘిక సంస్థ కార్యకర్తలట.

ఈరోజు టీచర్సుడే కావటంతో ఒక ఉపాధ్యాయుడిని సత్కరించి ఫలితాన్ని పొందుదామని నిర్ణయించుకున్నారుట. ఆ మహాభాగ్యాన్ని ఉపాధ్యాయుడయిన రాజారావు వారికి కలిగించాలని కోరారు.

"రెండు రోజుల ముందే మీకీవిషయాన్ని తెలియ చేయాలనుకున్నాము. కానీ పనుల వత్తిడిలో రాలేకపోయాము. క్షమించండి. మీరు శ్రమ అనుకోకుండా వెంటనే బయలుదేరండి" అన్నాడు రెండో ఆయన. పేరు రంగనాధంట. ఎంతో నమ్రతతో అడుగుతున్నాడు.

"మా అబ్బాయి ఆనందు మీ స్కూలేనంటే నట మిమ్మల్ని గురించి ఎంతో గొప్పగా చెప్తూ వుంటాడు. ఇప్పుడసలు వాడు చెప్తేనే మీ ఇల్లు గుర్తు తెల్సుకోకలిగాము" ముకుందరావు మళ్ళీ అందుకున్నాడు.

ఆ ఆనందు సంగతి తెలియంది కాదు రాజారావుకు. మాస్టర్లకు మారుపేర్లు పెట్టటంలో మహామొనగాడు.

"పెద్దవాళ్ల కెవరికన్నా ఇటువంటి సన్మానాలు చేస్తే బాగుంటుంది. కాని నాబోటివాళ్ల కెందుకండీ" అని రాజారావు ఎంత చెప్పినా వారు వినిపించుకోలేదు.

గట్టిగా రానంటే కాళ్లూచేతులు కట్టేసి కార్లో పడేసి తీసుకు వెళ్లేటట్లున్నారు. ఇప్పుడేవస్తానని లలితతో చెప్పను కాఫీ కలుపుతున్న ఆమె తెల్లబోయి చూస్తున్నది.

మహా తొందర పెట్టేస్తున్నారు వాళ్ళు. ఇక తప్పదని కారులో ఎక్కాడు.

అసలు ఈ టీచర్సుడే తతంగం మధ్యాహ్నం స్కూల్లో జరిగింది, మీటింగు పేరుతో.

ఉపాధ్యాయులంతా దేశ శ్రేయస్సుకు పాటుపడాలనీ, భావిభారత పౌరుల భవిష్యత్తు వీరి చేతుల్లోనే వున్నదనీ, ప్రధానోపాధ్యాయులవారు గుర్తు చేస్తే ఆ క్షణంలో పరవశించిపోయారు ఉపాధ్యాయులంతా.

నెల నెలా సరిగా అందని జీతాలు కాని విడుగూ బొదుగూలేని జీవితాలు కాని గుర్తుకు రాలేదు అప్పుడు.

నిజమే ఉపాధ్యాయుల పాత్ర ఎంతయినా వున్నది. ఎలక్షన్ల ముందు జనాభా లెఖ్ఖలు సేకరించటానికి, ఎమర్జెన్సీలో ఫామిలీ ప్లానింగు ఆపరేషన్లు చేయించుకోమని జనాన్ని ఒప్పించేటందుకు పల్లెపల్లెకూ ఇంటింటికీ తిరగటానికి ఎంతయినా ఉన్నది అనుకున్నాడు.

ఇంతలో కారు అందంగా అలంకరించిన ఒక భవనం ముందు ఆగింది. ముకుందరావూ, రంగనాధం రాజారావును లోపలికి తీసుకువెళ్ళి ఆ సంస్థ అధ్యక్షునికీ కార్యదర్శికీ పరిచయం చేశారు. నమస్కారాలయినాయి

వారి ముఖాల్లో పోగొట్టుకున్న దేదో దొరికినంత ఆనందం తొంగి చూసింది.

తరువాత ఒక్కొక్కరూ ఆహ్వానితులు రావటం మొదలయింది ఒక గంట గడిచాక కార్యక్రమం మొదలయింది ప్రార్థనతో.

పేరు పేరునా అందరికీ స్వాగతాలు అయినాయి.

రాజారావును వేదికపైకి ఆహ్వానించారు.

పిల్లలకు పాఠాలు చెప్పటం తప్ప ఉపన్యాసాలు ఇవ్వటం అలవాటు లేని రాజారావు సభికుల నుద్దేశించి ఎట్లా మాట్లాడాలా





# యోగ చతుష్టయం

మానవులు మోక్షమును పొందుటకు తగినవి యోగమార్గాలు. ఆ యోగాలు నాలుగు విధాలుగా ప్రసిద్ధములై ఉన్నాయి. అవి- (1) భక్తి యోగం, (2) కర్మ యోగం, (3) జ్ఞాన యోగం, (4) రాజ యోగం. ఈ యోగాలన్నింటిలోనూ నాల్గవ యోగమే అత్యుత్తమమైనదనీ, యోగరాజమనీ అంటున్నారు. అందువల్లనే దానికి రాజయోగమనే పేరు వచ్చింది.

పై యోగాలలో ఒకదానికంటె మరొకటి మేలైనది. భక్తియోగం కంటె కర్మ యోగం ఉత్కృష్టమైనది. దానికంటె జ్ఞానయోగం మేలైనది. దానికంటె రాజయోగం గొప్పది. అందువల్లనే దీనికి సర్వోత్కృష్టత లభించినది.

భక్తియోగం మిగిలిన యోగాలకంటె సులభమైనది. దానికి ఎక్కువ శ్రమ అక్కర్లేదు. మనస్సును భగవంతునిపైనే ఉంచి స్తోత్రం చెయ్యడం, పాటలు పాడడం, పూజలు, భజనలు చెయ్యడం ఈ యోగంలోని భాగాలు. కాని యీ యోగం వల్ల మోక్షం సాధించడానికి చాలాకాలం పడుతుంది. సర్వ జనులకూ సాధ్యమైన యీ యోగాన్ని పిపీలికా మార్గమని అంటారు. కార్యసాధన చీమ నడకవలె సాగుతుందన్న మాట! చీమ గమ్యస్థానాన్ని చేరాలంటే చాలా కాలం తీసుకుంటుంది. అది చెట్టు కొనకొమ్మ మీద ఉన్న పండు దగ్గరకు మిక్కిలి మెల్లగా పోయి, దానిని అనుభవిస్తుంది.

కర్మయోగం భక్తియోగం కంటె కష్టమైనది. కర్మాచరణ అందరికీ సాధ్యపడదు. దాని మూలంగా లక్ష్యం సాధించడానికిన్నీ చాలాకాలం పడుతుంది. దానికి ఎంతో సహనం ఉండడం అవసరం. అందువల్ల చాలామంది యీ మార్గాన్ని అనుసరించరు.

జ్ఞానయోగం కర్మయోగం కంటె కష్టసాధ్యమైనది. దానికి గొప్ప మేధాశక్తి అవసరం. గమ్యాన్ని చేరడానికి మిగిలిన రెండింటి కంటె ఇది తక్కువ కాలాన్నే తీసుకుంటుంది కాని ఇది ఏ కొద్ది మందికో తప్ప అందరికీ సాధ్యం కాదు. ఇది ప్రజ్ఞాసాధ్యమే అని తెలిసి చాలామంది దీని జోలికి పోరు.

రాజయోగం ఇతర యోగాల కన్న చాలా కష్టసాధ్యమైనదే! దీని మూలంగా కొంది కాలంలోనే గమ్యాన్ని చేరవచ్చు. ఈ యోగాన్నే విహంగ మార్గమంటారు. అంటే పక్షి రివ్వున ఎగిరిపోయి వృక్షం చివరి ఫలమును ఆస్వాదించు పద్ధతి. ఈ యోగంలో అనేక పద్ధతులున్నవి. వీటిలో హఠయోగం, లంబికాయోగం అసాధ్యాలు. సరియైన పద్ధతిలో లేకపోతే వాటివల్ల ప్రమాదం కూడాను. కుండలినీ యోగం మాత్రం ప్రమాద రహితమైనది. సౌమ్యమైనది. ఇది వెన్నెముక క్రింద చివరి భాగంలో పామువలె ముడుచుకుని ఉండే శక్తినే కుండలినీ శక్తి అంటారు. ఏ జప తపాలకైనా ఈ శక్తి ప్రబోధించబడాలి. గురువు ఉపదేశించిన విధంగా ప్రాణాయామం వల్లనే ఇది మేల్కొంటుంది. యోగ సాధన చేసేవారు గురువు ఆదేశాన్ని తప్పక అనుసరించాలి. స్వయంగా పుస్తకాలు చూచి సాధన చెయ్యకూడదు. దానివల్ల అనేక ప్రమాదాలు సంభవించవచ్చును.

---

వింత సేపు మాట్లాడవచ్చో అనుకుంటున్నాడు.

అధ్యక్షులవారు తమ సంస్థ ఇంతవరకూ చేస్తున్న సేవలనూ, బాల్యంలో ఉపాధ్యాయులవద్ద తమ అనుభవాలూ అనర్గళంగా అర్ధగంట ఉపన్యసించి బోరు కొట్టించారు.

కొందరు అభ్యుదయ కవులు ఉపాధ్యాయులపై కవితలు, గేయాలు చదివారు.

ఇంకా కొందరు ఈ సంస్థ చేస్తున్న మహత్కార్యాలను ప్రశంసిస్తూ అభినందించారు. ఇంకా ఇట్లాగే ఎన్నో సేవలు చేయాలన్నారు.

అనంతరం ప్రస్తుత ముఖ్యపాత్ర రాజారావుని గూర్చి చిరు పరిచయం కానిచ్చి పూల మాలాలంకృతుణ్ణి చేసి శాలువా కప్పారు అధ్యక్షులవారు.

## టీచర్స్ డే

ఇక రాజారావు మాట్లాడవలసిన సమయం వచ్చింది.

అనవసరమైన పొగడ్తలకు పోకుండా అసలు ఈ రోజు ఇంత వేడుకగా జరుపుకోవటానికి కారకులయిన డాక్టర్ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారిని గురించి క్లుప్తంగా చెప్పాడు. కేవలం ఉపాధ్యాయుడికి ఒకరోజు సన్మానం చేసి బాధ్యత నెరవేర్చుకోవటం కాకుండా ఆ మహనీయుని సిద్ధాంతాలను అమలు పర్చటానికి ప్రయత్నించమని అంటూ, ఉపాధ్యాయులకు అందరి సహకారము అందివ్వాలని కోరాడు.

విద్యార్థుల పట్ల ఇటు తల్లిదండ్రులూ అటు ఉపాధ్యాయులూ ఇద్దరూ తగినశ్రద్ధ తీసుకుంటే వారి భవిష్యత్తు బంగారుబాటగా అవుతుందని చెప్పి కృతజ్ఞతలతో శలవు తీసుకున్నాడు.

పత్రికలవారూ, ఫొటోగ్రాఫర్లూ ప్రముఖ వ్యక్తుల పేర్లూ, బొమ్మలూ ముందు వచ్చేటట్లు శ్రద్ధ తీసుకున్నారు.

వందన సమర్పణ అనంతరం వేదిక దిగేసరికి పది గంటలయింది.

కార్యకర్తలు ఆహ్వానితులలో గొప్పవారితో మాట్లాడుతూ వారెంతో శ్రమపడి వచ్చినందుకు ధన్యవాదాలు తెల్పడంలో పడి రాజారావు సంగతి మరచిపోయారనే చెప్పవచ్చు.

ఒక బతకలేని బడిపంతులుకు సహాయం చేశాము. శాలువా యిచ్చి, ఇక మన సంస్థ ఈ ఉపాధ్యాయ దినం ఘనంగా జరుపుకున్న ఖ్యాతి వచ్చింది అని తృప్తి పడుతున్నారు.

అసలా రోజు ఒక సంస్థ వారు అతనికి సన్మానం చేయాలనుకున్నారు. అర్థాంతరంగా ఆయనకేదో అవాంతరం రావటంతో ఆయన రాలేదు.

ఇక రాజారావుని కలుసు కోదలుచుకున్నారు. ఈ విషయం వారి సంభాషణను బట్టి తెలిసిందతనికి.

సరేలే, తనవల్ల ఓ కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగింది అనుకున్నాడు.

అతని కాగలో తీసుకొచ్చినవారి జాడా జవాబూ లేదు అహ్వానితులలో ఒక పెద్ద వారిని అర్జంటుగా స్టేషనుకు తీసుకు వెళ్లారని తెల్సింది.

ఇక హాలులో వెళ్దామని బయటకు వచ్చేసరికి వాన పెద్దది అయింది. అక్కడనుండి ఇంటికి చాలా దూరం. వచ్చేటప్పుడు కారులో కనుక తెలియలేదు.

ఎలక్షన్లప్పుడు ఓటు వేయటానికి 'తరువాత నన్ను మరువకోయ్' అన్నా వినక బలవంతంగా వాహనమెక్కించి తీసుకుపోయి, ఓటేసి బయటకు వచ్చేసరికి బాడుగకయినా ఒక బండి కనపడక చచ్చి చెడి నడచి రావటం గుర్తొచ్చింది.

నిజమే మనిషి విలువ అంతే. ఓటు డబ్బాలో వేసేవరకే, తరువాత ఎవరెవరో.

ఒక రిక్షా పోతుంటే పిల్చి అడిగాడు. రాత్రిపూట అందులో వాన కనుక మూడు రూపాయలిమ్మన్నాడు. ఇక బేరంచేసి లాభం లేదు. జేబులోవున్న డబ్బులే నాలుగు రూపాయలు. తప్పదు కనుక గుర్తుచెప్పి రిక్షా ఎక్కాడు. బాగా చలి వేస్తుంటే భుజంమీద శాలువా నిండుగా కప్పుకున్నాడు. నిజంగా తాను ఉపాధ్యాయుడయినందుకు, చలికి శాలువా కప్పుకుని వెచ్చగా ఎంతో హాయి అనుభవిస్తున్నాడు.

చేతులో పూలమాలను చూస్తుంటే ఏవో తీయని ఆలోచనలు వస్తున్నాయి.

అసలారోజు రాజారావు వివాహమైన రోజు. పెద్దగ పార్టీలూ, వేడుకలూ జరుపుకోలేకపోయినా సాయంత్రం ఇద్దరూ కల్సి గుడికివెళ్లి భగవంతుని ప్రార్థించుకుని వస్తూ స్వీట్సుతెచ్చి పంచుకునేవారు.

అందుకోసమే మధ్యాహ్నం కాఫీ తాగకుండా ఆదాచేశాడు. తన సంసారం చిన్నదే అయినా బరువు బాధ్యతలు బాగానే వున్నాయి. స్వంతవూరు వదిలిరాని తల్లిదండ్రులకు నెల నెల కొంత డబ్బు పంపాలి. చెల్లెలి పెండ్లి బాధ్యత తనపైనే వున్నది. ప్రేమించి పెండ్లి చేసుకుని పెద్ద వుద్యోగంలో వున్న అన్న కన్నవారి ఆలనా పాలనా కనుక్కోడు. అందుకే తానా బాధ్యతలు స్వీకరించాడు

నాలుగు రూపాయలతో రిక్షా వాడికి మూడు ఇవ్వవలసివస్తే మిగిలినరూపాయితో స్వీటు ఏదైనా కొద్దిగా తీసుకు వెళ్దామనుకున్నాడు కానీ అప్పటికే షాపులు మూసేశారు.

ఇంటి దగ్గరకు వచ్చేసరికి రిక్షా ఆపమని చెప్పి డబ్బు తీస్తూ దిగేశాడు.

లోపలికి నడవబోతూవుండగా 'బాబూ' అని పిల్చాడు రిక్షా అతను

"ఇంకా ఏమిటి? అడిగినంతా ఇచ్చేశాను కదా" తిరిగి చూశాడు.

"చలికి ఆగలేకుండా వున్నాను బాబూ! చిన్న దుప్పటిముక్క ఇప్పించండి! చిరిగిపోయిన పాతబట్టయినా సరే మీకు పుణ్యం వుంటుంది" అంటూ వణికి పోతున్నాడు.

నిజమేమో! కాళ్ళపైకి వున్న నిక్కరూ, పైన అంతా చిరుగులతో వున్న బనీనూ. వయోభారం జీవనభారమే కాకుండా, మనుష లందరి భారాన్నీ రిక్షాలో కూర్చోపెట్టి మోస్తూ వుండటం, నీటిలో వంగి పోయిన నడుము. అతన్ని చూస్తూ వుంటే ఏదో ఆవేశం వచ్చింది. ఇంకేదో భావం మెదిలింది రాజారావు మదిలో.

ఆ టేచర్సు డే రోజున కట్టుకోవటానికి, కప్పుకోవటానికి, కడుపునిండా తినటానికి అంత తమాత్రంగా వున్న ఒక పాఠశాల ఉపాధ్యాయుడు ఏ పేరు ప్రతిష్ఠలూ కోరకుండా మనస్ఫూర్తిగా సంతోషంగా తన వంటిమీద వున్న శాలువా తీసి ఆ రిక్షా అతనికి కప్పాడు.

"వెళ్ళు. ఇక వెచ్చగా వుంటుంది" అని చెప్తున్న రాజారావు వంక కళ్ళనీళ్ళతో చూస్తూ, చేతులెత్తి దణ్ణం పెడుతూ, "చల్లగా వుండు బాబూ" అని దీవిస్తూ వెళ్తున్న రిక్షా అతను దేముడిలాగ అని పించాడు.

ఇవాళ గుళ్ళోకి వెళ్ళలేక పోయాడు. అయినా ఎంతో మంచిపని చేసినట్లు మన సంతా తృప్తిగా వున్నది.

ఏదో అవ్యక్తానందం మనసంతా ఆవరించింది.

అర్ధరాత్రి అజ్ఞాతంగా ఉపాధ్యాయుడు రిక్షావానికి చేసిన సన్మానం అది. ఆ సంఘటన ఏ ఫొటోగ్రఫరూ ఫొటో తీయలేదు.

ఏ విలేఖరి రాసుకోలేదు.

"ఇక పదిహేను సంవత్సరాల క్రితం ఈ నాటి రోజు తన జీవితంలో ప్రవేశించి కష్టసుఖాల్ని పంచుకుంటూ, సంసారసాగరాన్ని ఈదుతున్న తన అర్ధాంగి లలిత మెడలో ఈ పూలదండ వేయాలి" అనుకుంటూ లోపలికి నడిచాడు రాజారావు.



# ప్రాక్టీసు పెట్టబోడు



## శ్రీరంగం

సీరియల్
(గత సంచిక తరువాయి)

ఆ రోజు రాత్రి నిదురపోయే ముందు విమలతో యిలాఉంది పరిస్థితి అంటూ వివరించేడు.

'ఏంచేద్దాం అనుకుంటున్నారు?' అంది.

'అప్పు తేవాలని అనుకుంటున్నాను.'

'అహో అరవై ఏళ్ళకు అడ్డంబొట్టు అటక ఎక్కి అమ్మా!' అన్నట్టుంది ఆ మాట. ఇంత చదువూ చదివి, యిన్నేళ్ళు కష్టపడి-యిప్పుడు అప్పుతెస్తారా? యీ పని చేయాలంటే యీ చదువంతా దేనికి?

'ఏంటి లెక్చరా!' అన్నాడతను.

'కాదు సలహా'

'సరే, ఆ పాటితోనే మార్గం చూపించు' అన్నాడు.

'ఇప్పుడు పడుకోండి, రేపు మీరు క్లినిక్‌కి వెళ్ళేటప్పటికి ఆలోచించి చెప్తాను' అంది.

తను మర్నాడు క్లినిక్కుకు వెళ్ళబోతూంటే 'తీసుకోండి' అంటూ అందించింది ఒక మూట.

తను అందుకోకుండా 'ఏంటి?' అన్నాడు.

'అదేనండి సమస్యలకు పరిష్కారం.'

తను ఆ మూట అందుకుని విప్పేడు. అందులో జత గాజులు, నాటి విలువ వెయ్యికంటే తక్కువ ఉండదు.

తను కూడా బంగారం తాకట్టు పెట్టడమే మార్గం అనుకున్నా, తను నోరు తెరవకుండా విమల తన బంగారం తీసి యిస్తూంటే చలించిపోయేడు. ఆఖరికి తను ఆడపిల్ల బంగారం అమ్ముకోవలసిన స్థితికి దిగజారిపోయేడా! దీనికంటే ఆ హరనాథ్‌ని అప్పు అడగడమే బాగుంది. అతను లేదన్నా తను బాధపడడు. వొద్దు అన్నాడు తన పరిస్థితికి తనే కదిలిపోతూ. విమల తన ముఖంలోకి దృష్టి తిప్పకుండా మాస్తూ 'ఇవి ఉన్నా అలమారులో మూలపడి ఉండటం తప్ప వాడుకలో కూడా లేవు. అదీ గాకుండా అవసరాల్లో ఆదుకుంటాయనే యిలాంటి నొస్తువులను వేయించుకోవడం' అంటూ తన జేబులో బలవంతంగా పెట్టి 'తాకట్టు పెట్టకండి. వొడ్డీ అనవసరంగా కట్టుకోవాలి. ఏకంగా అమ్మెయ్యండి. పన్నెండు వందలు వొస్తాయి. మూడునెలల

**జరిగినకథ 7:** కొత్తగా డిగ్రీ పుచ్చుకున్న డాక్టర్ సుదర్శనం డిస్పెన్సరీ పెడ్తాడు. కాలనీలో తను కుటుంబానికి ఐరుగు పొరుగుగా వున్న శివయ్య, వెంకట్రామయ్యల తగాదాకు పరిష్కారం సూచిస్తాడు. ఎంతోమంది డాక్టర్లకు చూపించుకొని, కొన్ని వేల రూపాయలు డబ్బు ఖర్చు పెట్టినా తగ్గని వీరేశం జబ్బుకు డాక్టర్ సుదర్శనం తగ్గే మార్గం చెబుతాడు. ఫీజు క్రింద వీరేశం ఇచ్చిన అయిదు రూపాయలను తీసుకొని 'తన మొదటి సంపాదన' అని ఆనందిస్తాడు సుదర్శనం. తన దగ్గరకు వచ్చే పేషెంట్స్‌తో అనేక సమస్యలను విదుల్చుకుంటూంటాడు డాక్టర్ సుదర్శనం. తన స్నేహితుడు డాక్టర్ హరనాథ్ ఇంటికి వెళ్తాడు డాక్టర్ సుదర్శనం. అక్కడ అతనిభార్య శోభ, డాక్టరుభార్యగా తన జీవితం మీద అసంతృప్తిని వెళ్ళడిస్తుంది. డిస్పెన్సరీ మీద వచ్చే డబ్బులు దాని ఖర్చులకే సరిపోయేవి. ఇంటి ఖర్చులకు ఎక్కడ నుంచి తేవాలా అని ఆలోచిస్తూ వుంటాడు డాక్టర్ సుదర్శనం.

తర్వాత పరిస్థితులు ఎలాఉంటాయో చూసి ఆలోచిద్దాం తర్వాత ఏం చేయాలో ?' అని అంది

'తిరిగి నేను నీకు యివి కొనగలనా ఎప్పటి కేనా ?' అనుకుంటూ బాధతో యింటినించి బయలుదేరేడు.

క్లినిక్కులో కూర్చున్న తర్వాత తను ఆలోచించడం మొదలు పెట్టేడు. తన ప్రాక్టీసు తనకు చేతి కందివచ్చేదాకా, తను ఎక్కడేనా పార్టుటైం చేస్తే ? కాని సాధారణంగా ప్రయివేట్ ప్రాక్టీసులో వొక డాక్టరు మరో డాక్టర్ని పెట్టుకోడు. పెట్టుకుంటే క్రొత్త డాక్టరు పేషంట్లతో చనువును పెంచుకుని ఎక్కడ ప్రాక్టీస్ కొట్టేస్తారో అన్న భయం. తను పార్టుటైం చేసినా మధ్యాహ్నం పన్నెండు నించి నాలుగు దాకానే చేయగలడు. తనకు వీలైన యీ టైములో పార్టుటైం ఎవరిస్తారు.

ఇప్పుడు ఆలోచన అంటూ వొచ్చింది కాబట్టి యిక ప్రయత్నం అంటూ చేయాలి. సక్సెస్ అయిందంటే తను అదృష్టవంతుడే.

క్లినిక్ కట్టేయగానే హరనాథ్ దగ్గరికి వెళ్లేడు. హరనాథ్ క్లినిక్కులో లేడు. పని మీద బయటికి వెళ్ళేడని కాంపవుండరు చెప్పేడు. వొచ్చేటప్పటికి అరగంట పట్టొచ్చు అని కూడా అన్నాడు.

అతని క్లినిక్కు ఎప్పటిలాగే జనంతో నిండిపోయి వుంది. అందరూ ఎదురుచూసే హరనాథ్‌ని తలచుకోగానే కొంచెం తనకు అసూయ కల్గింది. కాని వెంటనే ఆభావాన్ని ప్రక్కకు నెట్టేస్తూ 'డాక్టర్ రాగానే నాకు కబురు పెట్టు. నేను యింట్లో శోభతో మాట్లాడుతుంటాను' అని చెప్పి తిరిగి యింటికొచ్చి కాలింగ్ బెల్ కొట్టేడు! గుమ్మంలో పసుపుతో నుదుట కాసంత కుంకంతో శోభ బయటికి వచ్చి తలుపుతీసి తన్ను చూస్తూనే 'రండి' అంది.

మునుపటి సహజమైన పరిసరాల్లోకి వచ్చినట్టు అనిపించలేదు. తనకు ఇందులో అసహజమైన మార్పు గోచరిస్తోంది. ఆలోచించగా యీ మార్పుకు కారణం శోభ అని అర్థం అయింది. తను లోగడలో చూసినన్ని సార్లూ— శోభ యిలా కనపడలేదు.

కుర్చీలో కూర్చుంటూన్న తనతో 'కాఫీ తీసుకుంటారా' అంది.

తను కళ్ళను ఆమె వైపే తిప్పి 'యిదేంటి?' చనువు యిచ్చిన అధికారంతో అడిగేడు.

అది అతి చిన్న విషయంలా నవ్వేస్తూ 'నిమల పూజ చేయడేంటి? ఎన్నడూ పూజ చేస్తూన్న మనిషిని చూడని వాడిలా అడిగేస్తున్నారు ?'

'చూసేను! కాని ఎన్నడూ యీ మనిషి యిలా చూడలేదు... అందుకని' మాటల గురించి తను తడబడుతున్నాడు.

శోభ 'డాక్టరుగారూ మీరు యీ మధ్య ప్రతిదాన్ని కొత్త దృష్టితో చూసేస్తున్నారు. అందుకే సరిగా చూడలేకపోతున్నారు' అని 'యింతకీ కాఫీ తీసుకుంటారా అంటే ఏం చెప్పేరు కాదు.'

'వొద్దులే' అని తను అనగానే 'సరే అయితే మీరు కూర్చోండి, నేను పూజా మందిరంలో కెళ్ళి పూజ చేసుకోవాలి' అంది.

ఆ యింట్లో యిదివరలో పూజా మందిరం వున్నట్టు తనకు తెలియదు. ఆ మాటే అంటే 'యిది లేటెస్టు ఎడిషన్! దీంతో యింటికి పరిపూర్ణత్వం అంటూ వొచ్చింది.' 'ఏదీ నీ పూజామందిరం చూపెట్టు' అంటూ తను ఆమె వెంబడి పూజ గదిలోకి వెళ్ళేడు. ఆ గది అంతా డెకొరేషన్‌తో చాలా ఖర్చుపెట్టి చేయించినట్టున్నారు. ఒకమూల ఎత్తు పీట! దాని మీద పాలరాతి విగ్రహం రాజరాజేశ్వరీదేవిది.

తను అక్కడేవున్న అన్ని స్తోత్ర పుస్తకాలనూ చూస్తూ, 'మీరు దేవుణ్ణి ఏం కావాలి అని కోరుకుంటారు?' అన్నాడు.

'నా భర్త ప్రాక్టీసు యింకా పెరగాలి, అతనికి ఇరవై నాలుగు గంటలూ పని ఉండాలి. వేరే డాక్టర్ల దగ్గరికి వొక్క మనిషీ వెళ్ళకూడదనీ.'

'పాపం కాదా! అలా ప్రార్థించడం.'

రెప్పపాటు కాలం ఆమె కళ్ళు మనక బారి తిరిగి ప్రకాశం పుంజుకుని 'పాపమా నేను కోరిన కోరిక? చాలా పుణ్యమయిన కోరిక అది. ఊళ్ళో జనం అంతా మా వారి దగ్గరికే వొస్తే— వాళ్ళు వాళ్ళ క్లినిక్‌లు ఎత్తి కట్టేసి- ఉద్యోగాలకంటూ వెళ్ళిపోతారు. అప్పుడు ఎంత శుభంగా వాళ్ళ భార్యలు వాళ్ళతో— యీ నిరీక్షణ అంటూ లేకుండా... యిలా వొంటరితనం అనుభవించకుండా...'

ఆమె పూర్తి చేయలేదు. తన్ను చూసి నవ్వింది. బాధను సూచించే నవ్వు.

తన నోటవెంట మాట రాలేదు కొద్ది సేపుదాకా, ఆమెలోని తుఫానులు అర్థం అవుతూన్నకొద్దీ.

అప్పటినించి తన్ను తాను దూరంగా విసిరివేసుకొంటూన్న యీ పిల్లను చూస్తూంటే— భయం వేసింది. తన భావాల్ని తనలోనే యిమిడిపోనిస్తూ, 'పోనీ నీవు కొందరితో పరిచయాలు ఏర్పరచుకుంటే ?'



# ప్రాక్టీసు పెట్టిచూడు

'మనస్సుని మళ్ళించుకోడానికి- పరిచయాలు అయితేనేం- యీ పూజలు అయితేనేం?' అంటూ 'యీ బోర్ టాపిక్ వదిలి పెయ్యండి బాబూ' అంటూ అతి తేలికగా నవ్వేస్తూ 'మీరు ఘంటసాల భగవద్గీత టేప్ విన్నారా?' అంది సడన్‌గా. 'నాకు అంత యిష్టంలేదు' అన్నాడు.

'నాకూ వొక నాలుగు నెలల క్రిందట దాకా అంత యిష్టమే అయేది కాదు. కాని యిప్పుడు ఆ రికార్డ్ అంటే నాకు ప్రాణం. వింటారేంటి? పెడ్తాను' అంది.

తను జవాబిచ్చే లోపలే యింటి ముందు కారు ఆగింది. అందులోంచి హరనాధ్ దిగుతూ 'శోభా' అని పిలిచేడు. శోభ గుమ్మంలోకి వెళ్ళింది. తనూ వెళ్ళేడు. తన్ను చూస్తూనే హరనాధ్ 'సుదర్శనం నువ్వు యిప్పుడొచ్చేవేంటి?' అని తన్ను పలకరించి గుమ్మంలోంచే 'శోభా నాన్న గదిలో ఆయన మంచం మీద బెడ్‌షీట్లు మార్చు. ఇంకో నిముషంలో నాన్న వస్తున్నారు. క్విక్' అన్నాడు.

శోభ లోనికి వెళ్ళింది.

తనతో 'మా నాన్నకి పెరాలిసిస్ వొచ్చిందనీ అతను వొంటిగంట ప్లేయిన్లో వొస్తున్నారనీ టెలిగ్రాం వొచ్చింది. నేను ఎవరికీ చెప్పలేదు. ఇప్పుడే ఎయిర్ పోర్టుకెళ్ళి యాంబులెన్సు రెడీ చేయించి ప్లేన్ రాగనే అతన్ని అందులో చేర్చి డ్రైవర్ని యింటికి తీసుకురమ్మని నేను ముందు వచ్చేను. వాళ్ళు వెనకే వొస్తున్నారు.'

అతను అన్న నిముషానికి యాంబులెన్సు గుమ్మంలో ఆగింది. ఆరడుగుల పర్వతేశ్వరరావుగారిని స్ట్రెచ్చర్ మీద యిద్దరు లోనికి తెచ్చేరు. అతని భార్య చాలా దిగులుగా కనిపించింది.

పర్వతేశ్వరరావు గారిని లోనికి చేర్చి, యాంబులెన్స్ పంపించేసి తనతో 'చూడు ఎంత బాడ్‌లక్కో! కదలక కదలక ఇన్నో ఏళ్ళ తర్వాత యింటినించీ కదిలేరా? శుభ్రంగా యీ టూర్‌ని ఎంజాయ్ చేయకుండా మధ్యలో యీ జబ్బు ఏంటి చెప్పు? మా నాన్నకు సుఖం అంటూ జీవితంలో లేదేమో. ఏంటోనోయ్ యీ జీవితాలు' అంటూ కొంచెం వేదాంత ధోరణిలో మాట్లాడడం మొదలుపెట్టేడు హరనాధ్.

తనకు చాతనైన విధంలో అతన్ని వోదార్చి తను సెలవు తీసుకున్నాడు.

* * *

రోజులు చాలా మందంగా గడుస్తూ నెలలే తిరిగిపోతున్నాయ్. తన ప్రాక్టీసు అంతంత మాత్రంగానే ఉంది. విమలకు ఏడో నెల పడింది. నెలల తర్వాత నెక్లెస్ అమ్మవలసి వొచ్చింది. మారో మాట యాభైయో చేతికి వొస్తూంది, ప్రాక్టీసు మీదనించి. తను సిగరెట్టు కాల్చడం కూడా చాలా మటుకు తగ్గించేసేడు. బయట టీలూ, కాఫీలూ అసలు తీసుకోవడం లేదు. యిన్ని విధాల కూడిక చేస్తూంటే కూడా కనీస అవసరాలకు తట్టుకోలేకుండా పోతున్నాడు. తండ్రికి తన ప్రాక్టీసు ఫర్వాలేదు. ఇంటి బాధ్యత తను పూర్తిగా తీసుకున్నాను అన్న నమ్మకం బాగా కలిగింది. ఇక అతను దేన్ని గురించీ విచారం పడుతున్నట్టు కనిపించటంలేదు- వొక్కదానికి తప్ప. దాన్ని గురించి రెండుసార్లు తనతో 'సీతకు ఎక్కడైనా సంబంధాలు ఉంటే వెతుకురా! వొక ఆరునెల్లో దాని పెళ్ళి చేసేస్తే- వొక బాధ్యత తగ్గిపోతుంది. నాలుగేళ్ళ తర్వాత రాధ గురించి ఆలోచించొచ్చు' అన్నారు.

బాధ్యత పూర్తిగా తనమీదే వొదిలేసినట్టు కూడా లేదు. అతనూ సంబంధాలు చూస్తున్నట్టు విమల చెప్పింది.

మొదటి పురుడు పుట్టింట్లో అవాలి. మేము విమలకు ఏడో నెల పడగానే తీసికెళతాం అంటూ రెండు నెలల క్రిందటే ఉత్తరం రాసేరు విమల పుట్టింటి వాళ్ళు.

విమలని తీసికెళ్ళడానికి వాళ్ళ అమ్మ వొచ్చి రెండు రోజులయింది. రేపే విమల ప్రయాణం. ఇక ఆమె ఆరు నెలల దాకా రాదు.

ఆ రోజు రాత్రి విమల మెళ్ళో గొలుసు తీసి యిస్తూ, 'యిది వుంచండి. అవసరం ఉంటే వాడుకోండి' అంటూ ఎంత చెబుతున్నా వినకుండా బలవంతంగా యిచ్చి 'చూడండీ! మీ నాన్నగారు మీ ప్రాక్టీసు బాగుంది. మీరు సీతకు పెళ్ళి చేసేస్తారు అన్న ఉద్దేశంలో ఉన్నారు. అతనికే గాని మీ ప్రాక్టీసు గురించి తెలిసిందా, బెంగతో

(40వ పేజీ చూడండి)

# స్వయంవరం

సీరియల్ — చివుకుల పురుషోత్తం



## (గత సంచిక తరువాయి)

సంధ్య మనస్సులో హరికృష్ణ మెదిలాడు.

హరికృష్ణను చూసిన మొదటి చూపులోనే తన మనస్సును ఆకట్టుకున్నాడు హరికృష్ణ. కానీ తన స్నేహితురాలిని పెండ్లి చూపులు చూడబోతున్నాడని తెలిసి, మనస్సుకు పగ్గాలువేసి పెట్టింది. అంతరాంతరాల్లో హరికృష్ణ స్వరూపను తిరస్కరిస్తాడని ఆశించింది. అది కేవలం తన స్వార్థపూరితమైన ఆశయే కదు. నిష్పక్షికంగా ఆలోచించినా హరికృష్ణలాంటివాడు, స్వరూప లాంటి రూపం, తత్వం, ఉన్నదాన్ని అంగీకరించడు. స్వరూప తత్వాన్ని హరికృష్ణ కనిపెట్టడం అసాధ్యం!

ఒకరొకరు అర్థం చేసుకోవాలని, పెండ్లి చూపులు ఏర్పాటుచేస్తారు. కానీ, దానివల్ల ఏం లాభం? ఆ కొద్దిసేపట్లో ఏం అర్థం చేసుకుంటారు? ఏ చిన్నమాటనో పట్టుకొని, తెగ ఆలోచించి, అపార్థం చేసుకోవడమే సులువు.

మరి స్వరూప రూపం విషయంలోగూడా నైస్‌గా కమ్మేశారు. మేకప్ అయ్యాక, స్వరూపను చూసిన తనే ఆశ్చర్యపోయింది. ఇక హరికృష్ణ గూడా సమ్మతిస్తాడేమో?

కానీ, స్వరూప తనకు హరికృష్ణ నచ్చాడని చెప్పి ఉంటే, తను హరికృష్ణను సులువుగ మర్చిపోయి ఉండేది. కానీ స్వరూప ఎటూ తేల్చక ఇంకో సంబంధంగూడా చూడాలని అన్నందుకు తనకు స్వరూపమీద కోపం కలిగింది.

ఆ క్షణానే తన మనస్సులో ఒక నిర్ణయమూ జరిగిపోయింది! ఈరోజు రైలులో హరికృష్ణ పైన తనకు కలిగిన మధురమైన భావన, కలకాలం వర్ధిల్లాలి! హరికృష్ణ తనవాడు కావాలి! అని అనిపించింది.

కానీ ఎలా? స్వరూప అర్జెంటుగా ఆ హైదరాబాదు సంబంధాన్నిగూడా చూసి, అతడూ నచ్చలేదని, మళ్లీ హరికృష్ణే కావాలంటే? పుండరీకాక్షయ్య, శంకరయ్య ఎమ్మని బమ్మి చేసి అయినా హరికృష్ణ సంబంధం ఖాయం చేస్తారు. లేక ఈ లోపల ఇంకెవరైనా తమ పిల్లను ఇస్తామని రావచ్చు.

ఈ హరికృష్ణ మరీ ఇంత అన్‌రొమాంటిక్‌గా ఉన్నాడేంటి? అందగాడు, యువకుడు, ఉద్యోగస్తుడు అయి ఉండిగూడా, మా పిల్లను చూద్దువుగాని రా! అన్న ప్రతివాడివెంట వెళ్లి, ఆ పిల్లలను చూడడం ఏమిటి? హాయిగా తను నచ్చిన పిల్లను ఎన్నుకొని జీవితం ఆనందమయం చేసుకోగూడదూ?

ఎలా అయినా రేపు హరికృష్ణను చూడాలి! అతడి దృష్టిలో పడాలి! తన హృదయాన్ని కదలించిన హరికృష్ణ హృదయాన్ని తను కదిలించ లేదా? తనను చూస్తే, అతడు మెచ్చుకోడా? మెచ్చుకుంటే? ప్రేమిస్తాడు! ప్రేమిస్తే? పెండ్లి చేసుకుంటాడు! నిజంగా పెండ్లి చేసుకుంటాడా? కట్నం ఇస్తామని వెంటబడుతున్న వాళ్లను కాదని, తనను స్వీకరిస్తాడా? ఒకవేళ అతడు ఒప్పుకున్నా, లాభసాటిగాని ఈ పెండ్లిని హరికృష్ణ సోదరి, తల్లి ఆమోదిస్తారా? మరి, హరికృష్ణ ఏంపెట్టి తన సోదరి పెండ్లి చేస్తాడు? తవేగనుక హరికృష్ణ భార్య అయితే, తనూ ఉద్యోగం చేసి, డబ్బు సంపాదించి, మిగిల్చి హరికృష్ణ సోదరికి వివాహం చేస్తుంది. అలా చేయడానికి ఎన్నేళ్ళు పడుతుంది? కనీసం పదివేలు కూడబెట్టడానికి ఎన్నేండ్లు పడుతుంది? ప్చ్! అప్పటికి హరికృష్ణ సోదరి, ముసల్దికాదా? ప్చ్! ప్చ్! అన్ని పిచ్చి అయిడియాలు.

ఇలా అనుకునేప్పటికి, సంధ్యకు ఏడ్పు వచ్చింది. నిశ్శబ్దంగా, కుమిలి కుమిలి ఏడ్చింది. హరికృష్ణను తను పొందడం, అసాధ్యం! అతడికి తనపైన ప్రేమ కలుగడం అసాధ్యం! ప్రేమ కలిగినా, పెండ్లి చేసుకోవడం అసంభవం! అని, తలచుకుని తన దుఃఖాన్ని యింకా ఎక్కువ చేసుకుంది సంధ్య— సాడిస్టిక్‌గా.

చాలాసేపు మౌనంగా ఏడుస్తూ, కన్నీళ్లు కారుస్తూ, ఆఖరుకు రాత్రి ఒంటి గంట ప్రాంతంలో నిద్రలోకి జారుకుంది సంధ్య. తెల్లవారిందాకా కలతనిద్ర, కలలతో గడిపింది. ప్రతికలలోనూ, హరికృష్ణ రూపం సాక్షాత్కరించింది సంధ్యకు. ప్రతికలలోనూ హరికృష్ణకూ, తనకూ నడుమ అగాధాలు కనుపించాయి. హరికృష్ణ తనవంక చూచి, రమ్మన్నట్లుగా పిలుస్తాడు. తను అగాధం వంక చూసి, భీతిల్లుతుంది. కానీ, ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేకపోతుంది. ఇంతలో ఎవరో, హరికృష్ణను బలవంతంగా లాక్కునిపోతుంటారు. తను పెద్దగా కేకలు పెడుతుంది. హరికృష్ణ వెనక్కు తిరిగి తన వంక జాలిగా చూస్తాడు, కానీ వాళ్ల వెంటే వెళ్లిపోతూ ఉంటాడు ...

తెల్లవారగనే సంధ్యకు మెలకువ వచ్చింది. నిన్నటిరోజున జరిగిన సంఘటనలను నెమరు వేసుకుంది. ఆ సంఘటనలవల్ల తను ఎంత క్షోభ అనుభవించింది తెలుసుకుంది. తను తెలివి తక్కువగా ఆలోచించి, మనస్సును పాడుచేసుకున్నది అని అనుకుంది. హరికృష్ణ ఎక్కడో దూరంగా ఉన్న నయాగరా జలపాతం లాగా తోచాడు. అతడ్ని ప్రేమించడం ఏమిటి? దాని

***జరిగిన కథ-2:*** సంధ్య, స్వరూపరాణి స్నేహితురాండ్రు. సంధ్య గుంటూరులో టైపిస్టుగా పనిచేస్తోంది. ఆరోజు స్వరూపరాణి పెండ్లిచూపులు అవటంవలన రోజూకంటే ముందుగా విజయవాడకు వస్తున్న సంధ్య ట్రయిన్‌లో పెండ్లికొడుకు హరికృష్ణను చూసి, అతను స్వరూపరాణికి తగడను కొంటుంది. అతన్ని తన ప్రక్కన ఊహించుకొని ఆనందిస్తుంది. హరికృష్ణ విషయంలో ఎటూ తేల్చి చెప్పలేకపోతుంది స్వరూపరాణి.

వల్ల బాధే అనుకుంది. ఛ! ఛ! పిచ్చి ఆలోచనలు! తన నుదుట బ్రహ్మ పెండ్లి గీత గీయలేదు అలా గీసి ఉంటే, తన తండ్రికి, అరడజను మేనత్తలకూ, వాళ్ల మొగుళ్లకూ, తన అన్నయ్యకూ తనకు పెండ్లిచేయాలన్న ఆలోచనలు వచ్చిఉండేవి!

తమ కుటుంబంలో అందరూ స్వార్థపరులు. మేనత్తలు మెక్కిపోవడమేగాని, వాళ్లకు బంధు ప్రీతి ఏది? ఆ పుండరీకాక్షయ్య, శంకరయ్య కుటుంబాలు ఎంతో ఒద్దికగా, నడుచుకుంటారు. అంతంతమాత్రం రూపసి అయిన స్వరూపకు, ఎంతెంత పెద్ద సంబంధాలు తెస్తున్నారు? హుఁ! తనకు అంత ముఖ్యులైన వారు ఏరి?

ఈ చిన్న ఉద్యోగాన్ని ఆధారం చేసుకొని, క్రమంగా ప్రభుత్వంలోనో, బ్యాంకులోనో ఉద్యోగం సంపాదించుకుని, తన కాళ్లమీద తను నిలబడాలి! అది ముఖ్యం!

ఇలా ఆలోచించుకుని సంధ్య, తన గుంటూరు ప్రయాణానికి సిద్ధం అయ్యింది. భోజనం చేసి చిన్న బాక్సులో, అన్నం వగైరాలు పెట్టుకొని వానిని హేండ్ బాగ్‌లో పెట్టుకుని, ఎనిమిదిన్నర కల్లా విజయవాడ స్టేషన్‌కు చేరింది సంధ్య.

సంధ్య స్టేషన్‌లోకి రాగానే, ఏడెనిమిది మంది ఆడపిల్లలు సంధ్యను చుట్టుముట్టారు. "సంధ్యా! సంధ్యా! స్వరూపరాణికి, నిన్న పెండ్లి చూపులు జరిగాయటగా?" అని గొడవగా, ఆతృతగా అడిగారు.

"ముందు పోయి రైల్లో కూర్చుందాం పదండి! అక్కడ మాట్లాడుకోవచ్చు" అన్నది సంధ్య

"ఏం పర్లేదోయ్! ఒక బెంచి, బెంచి రిజర్వు చేసిపెట్టాము. కాపలాగా సరోజని గారున్నారు!" అన్నది గిరిజ.

గిరిజ జిల్లా పరిషత్‌లో టైపిస్టు. పాతిక సంవత్సరాలుంటాయి. అవివాహిత గిరిజ సామాన్యంగా ఉంటుంది కండ్లకు జోడును ధరించింది. తను అనాకారి అని ఆమె నమ్మకం! సంధ్య గిరిజలకు ప్రాణ స్నేహం. సంధ్య ఎంత అందంగా ఉంటుందో, గిరిజ అంత అనాకారి. అయినా, వారిద్దరూ ఒకరి హృదయం మంచిదని మరొకరు అనుకుంటుంటారు.

"ఇంతకీ ఏం జరిగింది? స్వరూపకు వచ్చాడా?" అడిగింది గిరిజ, ఆతృతగా.

సంధ్య సమాధానం చెప్పకుండా, లేడీస్ కంపార్టుమెంటులోకి వెళ్లింది.

బండిలో కూర్చున్న సరోజనికి "నమస్తే మేడం!" అని విష్ చేసి, సంధ్య ఆమె ప్రక్కన కూర్చున్నది. సంధ్య వెంట వస్తున్న ఆడపిల్లలు, తోసుకుని తోసుకొని సంధ్య ప్రక్కన కూర్చోవాలని పెనుగులాడుకుంటున్నారు. ఆఖరుకు గిరజ సంధ్య ప్రక్కన కూర్చున్నది. మిగితావాళ్లు దూర దూరంగా కూర్చున్నా, సంధ్య వైపు మెడలు రిక్కించి, వింటున్నారు.

"సంధ్యా! ఏంటి? స్వరూపరాణికి పెండ్లి చూపులు నిన్న జరిగాయని పిల్లలు అంటున్నారు నిజమేనా?" అని అడిగింది సరోజని

సరోజనికి ముప్పై సంవత్సరాలుంటాయి.

# స్వయంవరం

సరోజని భర్త విజయవాడలో ప్రభుత్వోద్యోగి. సరోజని గుంటూరులో లెక్చరర్ ఉద్యోగం చేస్తున్నది. సంధ్య సరోజని స్టూడెంటు. ఆమె గూడా సీజన్ టికెట్‌మీద గుంటూరు వచ్చి పోతుంటుంది.

"అవును మాడం!"

"ఏమైంది? అబ్బాయికి అమ్మాయి, అమ్మాయికి అబ్బాయీ, నచ్చారా?"

"ఇంకా ఏమీ తెలీలేదు మాడం!"

"సంధ్యా! ఆ అబ్బాయి, చాలా అందంగా ఉంటాడటగా?" అడిగింది గిరిజ.

"ఎక్సెప్షనల్ హేండసం! హిందీ సినిమాల్లో హీరోలాగా ఉంటాడుట!"

"నీవు చూశావా సంధ్యా?" అడిగింది సరోజని.

"లేదు మేడం! అంతా అనుకున్నారు. నేను పెండ్లిచూపులకెళ్లినా లోపల గదిలో ఉండి పోయాను."

"అంతేలే! నిన్ను పెండ్లికొడుకు కంట బడనిస్తుందా, రుక్మిణమ్మ?" అన్నదో అమ్మాయి

"అదేంటే? రాత్రిపూట పెండ్లిచూపులు పెట్టారట?" ఆశ్చర్యంగా అడిగింది గిరిజ.

"అప్పుడు చూపులకు మంచి ముహూర్తం ఉందట!"

"ఏడ్చినట్టే ఉంది! చూపులకు ముహూర్తం ఏమిటి? ఇందులో తిరకాసు ఉంది. పాపం ఆ కుర్రాడ్నెవడ్నో, టోపీలో పెట్టాలని చూస్తున్నట్లుంది. పగటిపూట స్వరూపను నచ్చదని, వాళ్ల భయం కావచ్చు."

"ఇంతకీ అబ్బాయి ఏమన్నాడటనే?" గిరిజ అడిగింది.

"అబ్బాయి అప్పుడే చెబుతాడా? పోయి జాబు రాస్తాం అంటారు!"

'దేవుడు మామయ్య'లో శోభన్‌బాబు



"ఊఁ! నిజమే! మరి స్వరూప ఏమంది?"

"ఆలోచించాలి అన్నది. ఏ సంగతీ ఖచ్చితంగా చెప్పలేదు."

ఆ మాటలను విన్న అందరూ నిర్విణ్ణులయ్యారు.

"ఏం సంధ్యా! కట్నం ఏమన్నా ఎక్కువ అడిగారా?" ప్రశ్నించింది సరోజని.

"కట్నం ఒక పెద్ద అడ్డంకి గాదేమో? అయినా, ఇంకా ఆ స్టేజీకి వెళ్లలేదు మాడం!"

"అబ్బాయి బ్యాంక్ ఆఫీసరటగా!"

"కాదు అసిస్టెంటు!"

"ఆ అబ్బాయిది గుంటూరేనటగా? ఏ బ్యాంకులో ఉద్యోగం? ఏ బజార్లో ఉంటాడు?" అడిగిందో అమ్మాయి.

"ఏమో! నాకు తెలియదు!" అన్నది సంధ్య.

"తెలిసినా చెప్తావటలే?" అని మూతి మూడు వంకర్లుగా త్రిప్పిందా అమ్మాయి.

వెంటనే గిరిజ అందుకుంది. "అమ్మాయీ! నీ కంత ఇంటరెస్టుగా ఉంటే, ఓ పని చెయ్యి! అయిదు రూపాయలు చేతపట్టుకొని, సేవింగ్స్ ఎకౌంటు ఓపెన్ చేస్తానని, అన్ని బ్యాంకులూ తిరుగు. ఎక్కడ నీకు అందగాడు కనిపిస్తే, అక్కడ అకౌంట్ ఓపెన్ చెయ్యి!" అన్నది.

ఆ మాటలతో అంతా గొల్లున నవ్వారు. పెండ్లికొడుకు వివరాలు అడిగిన అమ్మాయి, చిన్నబుచ్చుకుంది.

"ఇంతకీ ఆ అందగాడి రేటు ఎంత సంధ్యా?" మరో అమ్మాయి ప్రశ్న.

"పది నుండి పదిహేను వేల రూపాయలు ఉండొచ్చు!"

"పది పదిహేనువేల రూపాయలు తీసుకునే వాడు అందగాడెలా అవుతాడు? నన్ను అడిగితే, వాడు పరమ అగ్లీ ఫెలో, అంటాను!" అన్నది గిరిజ ఉక్రోషంగా

గిరిజ మాటలతో అమ్మాయిలందరూ, గిరిజ వంక చూశారు.

పొరలు పొరలుగా కనబడుతున్న గిరిజ కండ్లద్దాలను తీసి, పమిటకొంగుతో తుడుచుకొని మళ్ళీ పెట్టుకుంది.

"గిరిజా! ఏంటో కొత్త థియరీ మొదలెట్టావేంటి?" ఆశ్చర్యంగా అడిగింది సంధ్య.

"అవునే! ఎర్రతోలున్న వాళ్లను అందగాళ్లు అనడం, మనలాంటి చదువుకున్న అమ్మాయిలకు పనికిరాదు. మనిషి అంటే ఏమిటి? మనిషి అనగా, జంతువుకన్నా భిన్నమైన గొప్పదైన ప్రాణి అనిఅర్థం. ఎందుకనిగొప్ప? మనిషికిమనస్సు ఉంటుంది. ఆ మనస్సు అన్నది అతని ముఖంలో కండ్లలో, మాటలో, ప్రతిఫలిస్తుంది. అదే అతని వ్యక్తిత్వం. కనుక అందమైన నాగరికమైన, ఇతరులకు ఆహ్లాదాన్ని కలిగించే, భావాలున్నవాడే, అందగాడు. ఎర్రతోలు వేసుకుని, క్రాపూ మీసాలు పెంచుకొని దుష్ట భావాలు కలిగి, దుశ్చర్యలు చేసేవాడు అంద విహీనుడు పిచ్చి పిల్లల్లారా! జ్ఞాన నేత్రాలతో, అందాలు చూడండే! జంతు నేత్రాలతో చూడకండే! వరకట్నం అడిగినవాడు పుచ్చుకున్నవాడూ, పరమ అనాకారి! నాకైతే

అలాటి వాడ్ని చూస్తే, డోకువస్తుంది !'' అన్నది గిరిజ, ఆవేశంగా.

''హియర్ ! హియర్ !'' అంటూ, చప్పట్లు కొట్టింది సరోజని. అందరూ చప్పట్లుకొట్టారు

''థ్యాంక్యూ ! థ్యాంక్యూ'' అంటూ, రాజకీయవేత్తలాగా గిరిజ అందరికి వంగి, వంగి సెల్యూట్ చేసింది. దాంతో ఇంకా నవ్వారు అమ్మాయిలంతా.

''గిరిజా ! యూ మస్ట్ బి ఎ రైటర్ ! నీవు రచయిత్రి వెందుకు కాగూడదు ?'' అన్నది సరోజని సీరియస్‌గా.

''థ్యాంక్యూ మేడమ్ ! తమ ఆశీర్వచనం ఉండాలేగాని, నేను చేయలేని పని ఏముంది ?''

''గిరిజా ! తమాషాగాదు నేననేది. నీవు రచనలు చెయ్యి ! నీలాటి ఆవేశపూరితులకు, మంచి పేరు రావచ్చు. నీవూ గ్రాడ్యుఏట్‌వి కదా ? ఇప్పుడు రాసేవాళ్ళలో, నీయంత చదువు ఉన్న వాళ్ళు చాలా తక్కువ.''

''అలాగే మేడం ! ఏం రాయమంటారు.''

''వరకట్నాలమీద ఒక వ్యాసం రాయి ! ఇందాక నీవు చెప్పిన అందానికి నిర్వచనం చాలా బాగుంది !''

''అలాగే మేడం !''

''వ్యాసం గాదు, కథ రాయి !'' అన్నది సంధ్య.

''కథ గాదు, నవల రాయి !'' అన్నది మరో అమ్మాయి.

''అలాగే ! అలాగే ! అలాగే ! నేనురాస్తాను. మరి నా రచన పడిన పత్రికను అందరూ కొంటారా ?''

''తప్పకుండా కొంటాము ! అంతేగాదు ! ఆ పత్రిక కొనమని, ప్రచారం చేస్తాము !''

''అలాగైతే, తప్పకుండా రాస్తాను !''

అమ్మాయిలు ఇలా నవ్వుతూ, ప్రేలుతూ మాట్లాడుకుంటుంటే, గుంటూరు స్టేషన్ వచ్చింది. అంతా దిగి స్టేషన్ దాటి వెలుపలికి వచ్చారు.

గిరిజా, సంధ్యా జంటలుగా వెళ్తారు స్టేట్ బ్యాంక్ దాకా. అక్కడనుండి చీలిపోతారు. మిగతా వాళ్ళు తలో దారిన వెళ్తారు.

గిరిజా, సంధ్యా కలిసి వెళ్తుంటే సరోజని సంధ్యను కేకవేసి పిల్చింది. సంధ్య సరోజని దగ్గర కెళ్ళి 'ఏంటి మాడమ్ ?'' అని అడిగింది.

''సంధ్యా ! నిజం చెప్పు ! స్వరూపకు, ఆ కుర్రాడు నచ్చుతాడా ?''

''ఎలా చెప్పాలి మేడం ! అతని పెద్ద వాళ్ళు కట్నానికి ఆశపడి, అతడ్ని బలవంతం చేస్తే ఒప్పుకుంటాడేమో! ఏమైనా ఇప్పుడే ఏమీతెలీదు.''

''సంధ్యా ! నాకో సాయం చేసిపెట్టాలి !''

''చెప్పండి మేడమ్ ?''

''ఆ కుర్రాడి ఎడ్రస్ తెలుసుకుని చెప్పాలి !''

''ప్రయత్నిస్తాను మేడం !''

''ప్రయత్నించడం గాదు ! ఎలాగైనా కనుక్కోవాలి ! మా చెల్లి నీకు తెలుసును గదా ! ఆ స్వరూప కంటే బాగుంటుంది కదా ! స్వరూపను అతడు నచ్చుకుంటే, మా అమ్మాయిని చూపాలని ఉంది. మేమూ పది పదిహేనువేలదాకా పోగలం ! ఎలాగైనా పుండరీకాక్షయ్య ఇంట్లో అడ్రెస్ తెలుసుకో !''

''.................''

''ఏం ? మర్చిపోకు ! రాత్రికి ఎడ్రెస్ కనుక్కొని, రేపు బండి దగ్గర చెప్పగలగాలి !''

''అలాగే మేడం !''

''ఈ సంగతి ఎవరికీ చెప్పకు ! ఆ గిరిజ వాగుడు కాయ ! దాని కసలు చెప్పకు !''

''అలాగే మేడం !''

సరోజని వెళ్ళిపోయింది. సంధ్య గిరిజ దగ్గరకు వచ్చింది. ఇద్దరూ నడుస్తున్నారు.

''ఏంటే సంధ్యా ! మాడమ్‌గారు నీకేదో రహస్యం చెబుతున్నది ?''

''స్వరూపరాణిని చూడవచ్చిన పెండ్లికొడుకు ఎడ్రెస్ కావాలట !''

''ఎందుకట ! అందగాడని తెలియగానే పండ్లు పులిశాయటనా ? పాపం ! ఆ మొగుడ్నేం చేస్తుందట ? విడాకులిస్తుందటనా ?''

''ఛ ! నోరుముయ్యవే ! తన చెల్లికట !''

''ఓహో ! అదాసంగతి ! నీవేం చెప్పావు?''

''నాకు తెలీదన్నాను. కనుక్కొని చెప్పమన్నది.''

''స్వరూప సంగతి తేలకుండానేనా ?''

''ఆమె ఆతృత చూస్తే స్వరూప సంగతి

తేలేలోపలే తన చెల్లిని అతడికి చూపించాలని అనిపిస్తున్నది. పది పదిహేనువేలు కట్నం అయినా వెనకాడేట్లులేదు."

"హుం! వరకట్నాలు పొమ్మంటే ఏం పోతాయి? పైగా నన్ను రచనలు చేయమని చెప్పింది. చూస్తూవుండు, తగిస్తానొక రచనను! ఆంధ్రదేశం గడగడలాడిపోవాలి."

"నీ ముఖం! చదవడమేగాని రాయడం నీవల్లేం అవుతుందే? చదివి చదివి కళ్ళు పోగొట్టుకున్నావు. పాతికేళ్ళకే రెండు పెట్లు కండ్లజోళ్ళు మార్చావు. రాయడం నీవల్లగాదు."

"బెట్ పెడుతావా?"

"ఆహా! రాయడం నీవల్లగాదు. ఒకవేళ రాసినా అది ఎవడూ వేసుకోడు."

"ఎంత బెట్?"

"పదిరూపాయలు."

"ఓకే! సరే పద! శంకర్‌కేఫ్‌కు వెళ్లి కాఫీ త్రాగి పోదాం! ఇంకా టైం వుంది అటు బ్రాడీపేట మీదగుండా నడిచిపోదాం."

సంధ్య, గిరిజ హోటల్‌కు వెళ్లి కాఫీ త్రాగారు. అక్కడినుండి వాళ్ళ వాళ్ళ ఆఫీసులకు వెళ్ళారు. సంధ్య ఒక విశాలమైన కాంపౌండూ, ఐరన్ గేట్లూ, రెండు గారేజీలు, రెండంతస్తుల బంగళా వున్న ఇంట్లోకి ప్రవేశించింది. కాంపౌండ్‌వాల్ మీద పెద్ద సైన్‌బోర్డు వుంది. దాని మీద 'శ్రీదేవి టొబాకో కంపెనీ ఎక్స్‌పోర్టర్సు' అని వుంది.

బిల్డింగ్‌కు ముందు పోర్టికో వుంది. దాని చుట్టూర రకరకాలైన పూలమొక్కలు వున్నాయి. సంధ్య పోర్టికో దాటి విశాలమైన హాలులో ప్రవేశించింది. హాలులో చాలా టేబిల్సూ, చైర్సూ వున్నాయి ఒక టేబిల్ దగ్గర యాభైఏండ్లకు పైబడిన వ్యక్తి కండ్లద్దాలను ధరించి, లావుపాటి అకౌంటు పుస్తకాలను చూస్తూవున్నాడు. ఇక ఆ హాలులో ఎవరూ లేరు.

"నమస్కారం రామయ్యగారూ!" అన్నది సంధ్య.

రామయ్యగారు అనబడే వ్యక్తి తల ఎత్తి సంధ్య వంక చూసి, "రామ్మా! రా! నీవు వస్తే తనకు కనిపించమని అమ్మగారు అన్నారు" అని, మళ్ళీ తలవంచుకుని పుస్తకాలలోకి చూసుకుంటున్నాడు.

సంధ్య హాలు దాటి లోపలికి వెళ్ళి మెట్లమీదుగా మేడపైకి వెళ్ళింది అక్కడ ఒక గది ముందు ఆగి కాలింగ్‌బెల్ నొక్కింది వెంటనే "కం ఇన్" అన్న ఇంగ్లీషు గుర్తు గోడలో అమర్చిన గాజుపలక మీద పడింది. సంధ్య డోర్ నాబ్‌ను త్రిప్పి తలుపు తీసుకొని, గదిలోకి వెళ్ళింది.

ఆ గది ఎయిర్‌కండిషన్ చేయబడివుంది. గదిలో నేలపైన ఖరీదైన కార్పెట్ వుంది. సోఫాలూ, రేడియోగ్రాం, ఫ్రిజిడైర్‌లు పొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి. గదిలో ట్యూబ్‌లైట్ వెలుగుతున్నది. ఒక సోఫాలో యాభైసంవత్సరముల స్త్రీ అలంకరించుకుని కూర్చునివున్నది.

# స్వయంవరం

ఆమె అన్నపూర్ణమ్మ. శ్రీదేవి పొగాకు కంపెనీ ప్రొప్రైటర్ నాగభూషణంగారి భార్య.

"రా సంధ్యా! రా! కూర్చో" అన్నది ఆమె.

సంధ్య నేరుగా వెళ్ళి ఆమె ప్రక్కన సోఫాలో కూర్చున్నది.

"మీ నాయన నీకు పెండ్లి చేస్తాడా? లేక ఉద్యోగాలు చేసుకుని బ్రతుకమనే అంటున్నాడా?"

"నీకు తెలియందేముంది పిన్నీ? నాన్న దగ్గర డబ్బేది?"

"ఆ విజయవాడలోని కొంప అమ్మమను."

"తన ప్రాణం ఉండగా ఇల్లు అమ్మడానికి నాయనమ్మ ఒప్పుకోదు!"

"ఊఁ! సరే! ఒక సంగతి తేల్చి చెప్పు! నాకుగాదు! మీ బాబాయికి! నీవు ఉద్యోగం చేస్తావా? పెండ్లి చేసుకుంటావా?"

"పిన్నీ! నా పెండ్లికి తొందర ఏమొచ్చింది పిన్నీ! ఏదన్నా మంచి ఉద్యోగం వస్తే, నాన్నకు సాయంగా ఉంటుంది. అన్నయ్య, నాటకాలలో బలాదూరుగా తిరుగుతున్నాడుగదా? ఇంటికి పెద్దవాడు చేతికంది రాలేదని, నాన్న కృంగిపోతున్నాడు పిన్నీ! నాకు ప్రస్తుతం ఉద్యోగమే కావాలి!

**గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.**

నిజానికి ఇప్పుడు మీరు ఎంత సాయిం చేస్తున్నారో తెలుసునా? నాకిచ్చే రెండొందల యాభై రూపాయల జీతంలో, నాన్నకు రెండొందలు ఇచ్చేస్తున్నాను."

అన్నపూర్ణమ్మ ప్రేమగా, సంధ్య చెంపలు నిమిరి "సంధ్యా! నీవు చాలా మంచిదానివి! పాపం మీ నాన్న బహు కుటుంబి! అయినమట్టుకు ఏం జేస్తారు? సరే! మీ బాబాయి, నీకీ కవరు ఇమ్మన్నాడు." అంటూ, పొడవాటి కవరును ఒకదాన్ని సంధ్య చేతిలో పెట్టింది అన్నపూర్ణమ్మ.

"ఏంటిది పిన్నీ?"

"ఆంధ్రాబ్యాంకులో ఉద్యోగాలు పడ్డాయట! నిన్ను అప్లై చేయమన్నారు! అప్లికేషన్‌ఫారాలు వగైరాలు కవర్లో ఉన్నాయి!"

"సరే పిన్నీ! అప్లై చేస్తాను! పిన్నీ, బాబాయిగారు ఊళ్లోలేరా?"

"పొద్దున్నే కార్లో హైదరాబాద్ వెళ్లారు!"

"అన్నయ్య?"

"అన్నయ్య కలకత్తా వెళ్లాడు!"

"సరే పిన్నీ! అర్జెంటు కాగితాలేమైనా ఉంటే, టైప్ చేసి పోస్టు చేయాలి వెళ్లిరానా!"

"పోయిరా!"

సంధ్య గదిలోనుండి వెలుపలికి వచ్చింది. మేడమెట్లు దిగి హాల్లోకివచ్చి రామయ్య టేబుల్‌కు ఎదురుగా కుర్చీలో కూర్చున్నది.

"రామయ్యగారూ! అర్జెంటు లెటర్స్ ఏమైనా ఉన్నాయా?"

"ఉన్నాయమ్మా! చాలా వున్నాయి! నీ టేబుల్‌మీద పెట్టాను. అవి ఈరోజే పోస్టులో పడాలి!"

"అలాగే నండీ!"

సంధ్య తన టేబుల్ దగ్గరకు వచ్చి కూర్చున్నది. వరుసగా లెటర్సన్నీ టైప్ చేసింది. ఒంటి గంట ప్రాంతంలో టైపు చేసిన లెటర్సన్నీ రామయ్యచేత సంతకం చేయించి, అన్నింటిని వేరు వేరు కవర్లలో పెట్టి బిళ్లలు అంటించి, డిస్పాచ్ రిజిష్టర్లో ఎంటర్ చేసి ఒక బొత్తిగా రామయ్యగారి టేబిల్‌మీద పెట్టింది.

తను తెచ్చుకున్న బాక్సులోని అన్నం తిని, బాక్సును శుభ్రం చేసి హేండ్ బాగ్‌లో పెట్టుకుని తన సీట్‌లో కూర్చుంది. అన్నపూర్ణమ్మ ఇచ్చిన కవర్‌ను తీసి, అందులోని కాగితాలనుపరిశీలించడం మొదలెట్టింది. అప్లికేషన్ పంపుకోవాడానికి ఇంకా చాలా టైంవుంది.

సంధ్య అలా అప్లికేషన్ కాగితాలు చూస్తూవుంటే, ఆ కాగితాలకు బదులు హరికృష్ణ రూపం సంధ్య మనస్సులో మెరిసింది. నల్లని క్రాపు, పచ్చని నుదురుమీద నాట్యంచేస్తుంటే ఆశ్చర్యంగా కృష్ణ బ్రిడ్జిని, కృష్ణానదిని చూచే హరికృష్ణ రూపం సంధ్య మనస్సులో ముద్రితం అయింది.

ఇంక అసాధ్యం! తను హరికృష్ణ రూపాన్ని మర్చిపోలేను అనుకుంది. ఇంతలో గిరిజ మాటలు ఖంగున స్ఫురించాయి. 'మనిషికి మనస్సు ఉంటుంది! ఆ మనస్సు అన్నది అతని ముఖంలో, కండ్లలో, మాటల్లో ప్రతిఫలిస్తుంది. అదే అతని వ్యక్తిత్వం! కనుక అందమైన, నాగరికమైన ఇతరులకు ఆహ్లాదాన్ని కలిగించే భావాలున్నవాడే అందగాడు...జ్ఞాననేత్రాలతో చూడండే!' అవును గిరిజ నిర్వచనం ప్రకారంగా గూడా, హరికృష్ణ అందగాడు! రైలులో ఎక్కిన తాతను అతడు ఎంత మానవత్వంతో గౌరవించాడు? అవును! తను హరికృష్ణను, మొదటిసారి జ్ఞాననేత్రంతోనే చూసింది. అతని హృదయ సౌందర్యానికి, తన హృదయం పులకరించింది. ఆ తరువాత అతని బాహ్య సౌందర్యమూ చాలా గొప్పదని అనిపించింది.

హరికృష్ణను, తను ప్రేమించిందా?

హరికృష్ణను తలుచుకుంటేనే తీయని బాధ కలుగుతున్నది. అతడితో తనకు పెండ్లి అసంభవమే! ఒకవేళ అతడు తనను ప్రేమించినా పెండ్లి అవుతుందా? పెండ్లిలోనికి దించని ప్రేమ దుఃఖంలోకి దించదా?

పోనీ! దించనీ! 'ప్రేమ అంటే ఏంటో తెలియకుండా వుండటంకంటే, ప్రేమించి విఫలం చెందడంలో ఏదో అనుభూతి వుందన్నాడొక మనీషి. తనకు విఫల ప్రేమయే రాసిపెట్టివుందా.

అతని ప్రేమను పొందడానికి ప్రయత్నిస్తే? 'వనిత తనంత తా వలచివచ్చిన చుల్కనకాదే ...' అన్నట్లు తను చులకన అయిపోతుందా? పరిస్థితులవల్ల దైవఘటనవల్ల కలిగిన భగ్నమైన

ప్రేమకంటే పురుషుడి మలకనవల్ల భగ్నమైన ప్రేమ భయంకర దావానలంవలె దహించదా? నిజమే!...

తను ప్రయత్నించాలిగాని ప్రయత్నించినట్లు కనబడగూడదు. ప్రేమించాలిగాని ప్రేమించినట్లు కనబడగూడదు. తను హరికృష్ణ కోసం అలమటించిపోయినా అతడు తనకోసం ఆలమటించిపోయేలా చేయాలి. అతడే తనను ప్రాధేయపడేలా చేయాలి. కానీ, తను అలా చేయగలదా?

ఎందుకు చేయలేదు? దేవుడిచ్చిన ఈ అందం ఎందుకు? నీవు చాలా అందగత్తెవని సాటి స్త్రీలు అసూయపడుతుంటే ఉబ్బిపోడానికేనా? నో! నో! నో! హరికృష్ణను ఆకర్షించాలి. లేకుంటే ఈ అందం వ్యర్థం!

కానీ, ఎలా?

ఈ ప్రశ్నను కొన్ని వందలసార్లు వేసుకుంది సంధ్య. సరియైన సమాధానంకోసం నుదుటిని రుద్దుకుంది. కణతలు పట్టుకుంది. కనుబొమ్మలను నిమురుకుంది. కళ్ళు పైకల్లా ఎత్తి మెదడులోకి చూసింది.

తక్కున మెరుపులాగా ఒక ఆలోచన వచ్చింది.

అవును! అదే చేయాలి. ముందు హరికృష్ణ తల్లనీ చెల్లిని మంచిచేసుకోవాలి. ఆ తర్వాత... ఆ తర్వాత!... ఓ గాడ్!...

సంధ్యకు ఆలోచనలు జలపాతంలాగా ముంచుకుతూ ఉత్సాహాన్ని కలుగజేస్తున్నాయి. హరికృష్ణ అందుబాటులో వున్నట్లే తోచింది. సంతోషంతో సంధ్య దేహం జలదరించింది. ఉత్సాహం నరాలను ఉద్రేకపరుస్తుంటే దేహం వశం తప్పిపోతున్నది.

"ఏమ్మా! తలనొప్పిగా వుందా?" అన్నాడు రామయ్య.

"ఆఁ! ... అహఁ! ... అవును! ... తల ... నొప్పిగా వుందండీ."

"కాఫీ తెప్పించనా?"

"ఎందుకు! వద్దండీ! నేనే వెళ్లి తాగి వస్తాను."

"తలనొప్పి బిళ్ళ గూడా ఒకటి వేసుకో అమ్మా!"

"అలాగేనండీ! ఈపూట ... నాకేమైనా పని వుందా?"

"ఏం లేదమ్మా! కావాలంటే ఇంటి కెళ్లిపో. ఇంకో రెండునెలలదాకా పెద్ద పనేమీ వుండదు. ఆ తర్వాత సీజన్ వస్తుంది. అప్పుడు బాగా పని వుంటుంది. ఆ సీజన్‌లో ఇలా బండికి రావడం పోవడం కుదరదేమోనమ్మా! మరి ఇక్కడ వుండే ఏర్పాట్లేమైనా చేసుకోగలవా?"

"ఆలోచిస్తానండీ! నాన్నగార్ని బాబాయిని అడిగి వాళ్ళెలా చెప్తే అలాగ చేస్తాను."

"సరే! త్వరగా వెళ్లి టాబ్లెట్ వేసుకుని కాఫీ తాగు."

"వస్తానండీ!" అని సంధ్య హేండ్‌బాగ్ భుజానికి తగిలించుకుని చకచక బయలుదేరింది

౮

సంధ్య ఒక చిల్లర కొట్లోకి వెళ్లింది పట్నాభిపురంలో.

"ఒక తిలకంసీసా ఇవ్వండి."

అంగడివాడు తిలకంసీసా ఇచ్చాడు. సంధ్య రూపాయి కాగితం యిచ్చింది. అంగడివాడు చిల్లరను లెక్క పెడుతున్నాడు.

"ఇక్కడ రేడియో ఇంజనీర్ నాగార్జునరావు గారు ఎక్కడుంటున్నారో తెలుసునా?" అని అడిగింది.

"తెలీదమ్మా!" అన్నాడు అంగడివాడు. సంధ్య చిల్లరడబ్బులు తీసుకుని బయటకు నడిచింది.

మరో అంగట్లో కెళ్లి సోప్ ఒకటి కొని, రేడియో ఇంజనీర్‌ను గురించి అడిగింది. అక్కడా ఏమీ తెలీలేదు.

మూడో చిల్లరకొట్లో నాగార్జునరావును గురించి తెలిసింది.

'రేడియో ఇంజనీర్ నాగార్జునరావుగారిని గురించి తెలుసా?"

"తెలుసు తల్లీ తెలుసు! జీవితాంతం మర్చిపోకుండా వుండేట్లు చేశాడు."

"ఏం చేశాడు?"

"ఏం చెయ్యాలో అదే చేశాడమ్మా! ఏదో ప్రభుత్వోద్యోగి కదా అని ఖాతా పెట్టాను. రెండొందలు బాకీ చేసి ట్రాన్స్ఫర్ అయిపోయాడు."

''ఎక్కడికెళ్లాడు ?''

''విశాఖపట్నం.''

''మీ బాకీ ఇవ్వలేదా ?''

''ఇవ్వలేదు. ఇప్పటికి యిరవై జాబులు రాశాను. యాభై రూపాయలు పంపాడు.''

''మెల్లిగా ఇస్తాడేమోలెండి. పెద్ద కుటుంబం ఏమో ?''

''ఎంత పెద్దకుటుంబం అమ్మా! ముగ్గురు బిడ్డలు! పెళ్ళాం! అయితే దుబారాలు ఎక్కువ.''

''పిల్లలు కాలేజీలో చదువుతున్నారా ?''

''అవును ముగ్గురూ కాలేజీలో చదువుతున్నారు.''

''పాపం! ఖర్చులు ఎక్కువగదా! పైగా కాలేజీ చదువులు !''

''ఎంత కాలేజీ చదువులమ్మా! పెద్దమ్మాయి బి. ఏ. చదివింది. చిన్నఅబ్బాయిలు ఇంటరే చదువుతున్నారు, ఏమైనా ఇంజనీరింగా, మెడిసనా? అసలు ఆయన పెళ్ళాం దుబారా మనిషి. ఆఁ! అమ్మా! వాళ్ళు మీకు బంధువులా?''

''కాదు తెలిసినవాళ్లు !'' అంటూ అంగడి వదిలి బయలుదేరింది సంధ్య. ఆ బజారంతా విచారించి సీతారామయ్యగారి ఇల్లు తెలుసుకుంది.

సంధ్య నేరుగా హరికృష్ణ యింట్లోకి వెళ్లింది. హరికృష్ణ యింట్లో వుండడని ఆమెకు తెలుసు. ఇరవై సంవత్సరాలు వయస్సు కలిగిన పిల్ల, సంధ్యను చూసి కుర్చీలో నుండి లేచి నిలబడి, ''ఎవరు కావాలండీ?'' అని అడిగింది.

సంధ్య క్షణంలో ఆ పిల్ల హరికృష్ణ చెల్లెలని గ్రహించింది. ఆ పిల్ల పరికిణీ వోణీ వేసుకుని వుంది. అంత ఎత్తరి పొడగరిగాక మడియెత్తులో వుంది. ముఖంలో హరికృష్ణ పోలికలు బాగా కనిపిస్తున్నాయి. అమాయకత, బెరుకూ ఎక్కువ పాళ్ళల్లో వున్నట్లు తోచాయి సంధ్యకు. ఆ పిల్ల హరికృష్ణకంటే ఒకపాలు రంగు తక్కువగా వుంది.

''ఇక్కడ నాగార్జునరావుగారు ఉంటారులేదా?''

''లేదండీ! వాళ్ళు ఖాళీచేశాక మేము చేరాము.''

''అరెరే! నాకు తెలీదే ?''

''మల్లికా! ఎవరమ్మా వచ్చింది ?'' అని రోపలి గదిలో నుండి కేక వినిపించింది.

''ఎవరోనమ్మా! నాగార్జునరావుగారికోసం అట !''

''నాగార్జునరావా ? !'' అంటూ యాభై సంవత్సరాలు కలిగిన ఒక స్త్రీ ఇంట్లో నుండి ముందు గదిలోకి వచ్చింది. ఆమె భారీగా దృఢంగా వుంది. పచ్చని దేహ ఛాయలో వుంది. ఆమెను చూడగానే సంధ్య అనుకుంది. హరికృష్ణకు తల్లి పోలిక, రంగు, దార్ఢ్యమూ వచ్చాయి. మల్లిక తండ్రి చామనఛాయ అయివుండాలి! అనుకుంది.

''ఎవరమ్మా? మీరు !''

## స్వయంవరం

''నమస్కారం అండీ!'' అన్నది, సంధ్య అత్యంత వినయంగా, గౌరవంగా.

''దీర్ఘసుమంగళీభవ'' అని దీవించింది ఆమె.

''నాగార్జునరావుగారంటే మనకు ముందు, ఈ ఇంట్లో ఉన్నాయనే! వారికోసం వచ్చారు వీరు !'' అన్నది మల్లిక.

''అలాగా అమ్మా! వారికి ట్రాన్స్‌ఫర్ అయిపోయింది. విశాఖపట్నం వెళ్లారు! ఉండుండు! ఇల్లుగలావిడతో చెబుతాను. వాళ్లను గురించిన వివరాలు కావాలంటే, ఆమెగారు చెబుతారు'' అంటూ మల్లిక తల్లి వెళ్లబోయింది. సంధ్యకు వణుకుపుట్టింది.

''అహఁ! అవసరంలేదులెండి! పెద్ద పనేం లేదు! వాళ్లమ్మాయి నాకు తెలుసు. ఊర్కే చూసిపోదామని వచ్చాను. పెద్దవారు! మీకు శ్రమ ఇచ్చాను, మన్నించండి!'' అన్నది సంధ్య.

మల్లిక తల్లి, సంధ్య మాటలకు ముగ్ధురాలైంది. ''ఇందులో శ్రమ ఏం వుందమ్మా! పాపం! ఎండలో వచ్చావు! కూచో అమ్మా! మల్లికా! ఫ్యాన్ వేసి, మంచినీళ్ళు తీసుకునిరా అమ్మా!'' అన్నది.

''కూర్చోండి!'' అంటూ మల్లిక కుర్చీని చూపింది సంధ్యకు.

సంధ్య నిర్మొగమాటంగా పోయి కూర్చున్నది కుర్చీలో. మల్లిక టేబిల్ ఫ్యాన్ స్విచ్ నొక్కి ఇంట్లోకి వెళ్లింది.

''ఏమ్మా! నీ పేరేమిటి ?'' అని అడిగింది మల్లిక తల్లి.

''నా పేరు సంధ్యారాణి అండీ! సంధ్య అని పిలవండి! అరెరే! మీరు నిల్చొనే మాట్లాడుతున్నారు, కూర్చోండి! పెద్దవాళ్లతో కూర్చుని మాట్లాడాలంటే నాకు ఇష్టం వుండదు!'' అంటూ గుబుక్కున కుర్చీలోనుండి లేచింది సంధ్య.

మల్లిక తల్లికి, సంధ్య మాటలు బాగా నచ్చాయి. ''నా తల్లే! నా తల్లే! మంచి సాంప్రదాయపు కుటుంబంలోని పిల్లలాగా ఉన్నావు. మీ నాన్నగారు ఏంచేస్తుంటారమ్మా ?''

''మా నాన్నగారి పేరు కుటుంబరావుగారు! ప్రభుత్వోద్యోగం చేస్తున్నారు. అసలు మాది విజయవాడ. నేను బి.ఎ. పాసయ్యాను పోయిన సంవత్సరమే. ఊరికే వుండి ఏంచేయాలని, ఈ ఊళ్లో ఒక ప్రైవేటు కంపెనీలో టైపిస్టుగా ఉద్యోగం చేస్తున్నాను.''

''చాలా సంతోషం అమ్మా! మరి గుంటూరులో ఎక్కడుంటున్నావు ?''

''నేను ఈ ఊళ్లో ఉండనండీ! విజయవాడలో మా ఇంట్లోనే ఉంటాను. రోజూ రైలులో వచ్చి పోతుంటాను !''

''ఏమిటీ! రోజూ రైలులో వచ్చి వెళ్తావా ?!''

''అవునండీ! నేనే కాదండీ, రోజూ ఎనిమిది మంది ఆడవాళ్లం విజయవాడనుండి వస్తుంటాము. సీజన్ టిక్కెట్లు ఉంటాయి. ఆడవాళ్ల పెట్టెల్లో ఎక్కుతాము. ఆ ఎనిమిదిమందిలో ఇద్దరికి పెండ్లిడ్లుగూడా అయ్యాయి. విజయవాడలో కాపురాలు చేస్తూనే, గుంటూర్లో ఉద్యోగాలు చేసుకుంటున్నారు!''

ఇంతలో మల్లిక, మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది సంధ్య ఆ గ్లాసు నీళ్లను త్రాగింది మెల్లిగా. మంచినీళ్లు త్రాగుతుంటే, సంధ్యకు అనుమానం వచ్చింది. నీళ్లిచ్చి, త్రాగాక పోయిరా అంటారేమో అనిపించింది. మరి రెండు నిముషాలు ఛాన్సు ఇస్తే, ఈమెనూ, ఈమె కూతుర్నీ ఐస్‌చేసి పారేయొచ్చు అనుకున్నది.

''చాలా థాంక్సండీ! మరో గ్లాసు, ప్లీజ్...'' అని, ఖాళీగ్లాసును మల్లిక కిచ్చింది సంధ్య.

''అయ్యో! నా తల్లే! ఎంత ఎండనపడి వచ్చావు! ఇంకో గ్లాసు మంచినీళ్లు తాగి, కొంచం విశ్రాంతి తీసుకోతల్లీ!''

''చాలా కృతజ్ఞురాలనండీ! ఇప్పుడిప్పుడే ఎండలు ముదురుతున్నట్లున్నాయి!''

''అవునమ్మా! శివరాత్రి దగ్గరపడుతున్నది గదా! రాత్రిళ్ళు చలి, పగలు ఎండలు! ఇది చాలా చెడ్డకాలం! ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవాలి!''

## శరద్రాత్రి

వెండిమలామా చేయబడ్డ
చంద్రుడి క్రింద
విచ్చుకుంటున్న కలువల జంట
నవ్వుతున్నప్పుడు
రజత కిరణాల ప్రతిఫలింపు
ముదురాకుపచ్చ చెట్లపై
నిగారింపు
కలసి ఏర్పడ్డ కొత్త రంగు
చలిగాలికి ముడుచుకున్న
లిల్లీ పూలు
నాకూ చలివేస్తోందంటూ
గూట్లో దాగిన తెల్లని పిల్ల
నిండుగా పండుముత్తయిదువలా
పూలతో భారంగా వంగివున్న
పొగడచెట్లు
చంద్రుడి నవ్వుకి వెలవెల
బోతున్న తారలు
వెన్నెలను తనలో కలుపుకుని
సంగీతం పాడుతూ
సాగుతున్న పిల్ల ఏరు
గూళ్ళల్లో వెచ్చగా పడుకున్న
చిలుకల కలకల
ఉండుండి చలిగాలి వీస్తూ
మోసుకొస్తున్న సౌరభం
ఈ అందం చూస్తూ యిక్కడే
వచ్చిపోవాలనుంది ఈ క్షణం
హృదిలో దాచుకుని
ఆనందపడమంటోంది
ప్రకృతి ఆనంద నృత్యం

— కేతవరపు వెంకటరమణమూర్తి

"నిజం చెప్పారు. మీరు అచ్చు మా అమ్మ లాగా చెబుతున్నారు. ఈరోజు కొద్దిగా తలనొప్పిగా వుంటే, పర్మిషన్ పెట్టి ఆఫీసునుండి బయట పడ్డాను. నాగార్జునరావుగారి అమ్మాయిని చూసి చాలా రోజులు అయింది. ఆ అమ్మాయి నాకు మంచి ఫ్రెండ్. ఏం తోచకుంటే, ఇక్కడికొచ్చి, కాలక్షేపం చేస్తుంటాను!" అన్నది సంధ్య.

"అట్లాగా అమ్మా!"

మల్లిక రెండోగ్లాసు మంచినీళ్ళు తెచ్చిచ్చింది. సంధ్య కష్టంగా ఆ గ్లాసు నీళ్ళు త్రాగింది.

"మీకు నిద్రబోయే టైం అనుకుంటాను. మీరు విశ్రాంతి తీసుకొనే టైంలో వచ్చినట్లున్నాను. మీకు నిద్రాభంగం కలిగించినందుకు క్షంతవ్యురాలను. మరి ... నేను ... పోయిరానా?"

"అబ్బె! అబ్బే! అలాంటిదేమీ లేదు. ఎండనపడి వచ్చావు. కాసేపు విశ్రాంతి తీసుకో అమ్మా!"

"మీరు చాలా మంచివారిలాగా వున్నారు!"

మల్లిక తనూ ఒక కుర్చీని లాక్కుని సంధ్య ప్రక్కన కూర్చుంది.

"మా మల్లిక గూడా బి. ఏ. పాసైంది."

"అలాగా! ఎప్పుడండీ?"

"పోయిన ఏడు."

"అరే! నేనూ పోయిన ఏడే పాసయ్యాను."

"అయితే మీరిద్దరూ ఒక సంవత్సరమే పాసయ్యారన్నమాట!"

"అవునండీ! మరి మల్లికగార్కి పెండ్లి చేసేస్తారా? ఉద్యోగం చేయించాలని అనుకుంటున్నారా!"

"మాదంతా ఒక గాధ తల్లీ! మల్లిక యస్. యస్. సి దాకా హైస్కూలులో చదివింది. ఆ తరువాత ఇంటిపట్టునే వుండి బి. ఏ పాస్ అయ్యింది. ఉద్యోగం చెయ్యమంటే తనకు భయం అంటుంది. ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేయాలంటే మాటలా? అమ్మా!"

"నిజం చెప్పారు. ఈరోజుల్లో ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేయడం కష్టం అవుతున్నది. కట్నాల బెడద వుంది గదా! అందుకనే ఉద్యోగం చేయించడం మంచిది. అదీగాక ఉద్యోగస్తురాలిని పెండ్లి చేసుకోడానికి మగపిల్లలూ, వాళ్ళ పెద్దవాళ్ళూ సుముఖంగా వుంటున్నారు. కట్నం డబ్బులు గూడా నిక్కచ్చిగా అడుగరు. అదీ కొంత మేలే గదా?"

"నిజమేనమ్మా! కానీ ఉద్యోగాలు మట్టుకు దొరుకుతున్నాయా?"

"కష్టమేననుకోండి! ఏదో వేణ్ణీళ్లకు చన్నీళ్ళు, చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ ఏదైనా బ్యాంకు ఉద్యోగాలు చూసుకోవచ్చుగదా! నేను టైపిస్టు ఉద్యోగం చేస్తున్నానుగదా? రెండొందలయాభై ఇస్తారు జీతం. మొత్తం మొత్తం నాన్నగారికి ఇస్తుంటాను. ఇప్పుడు ఆంధ్రా బ్యాంకు ఉద్యోగాలు పడ్డాయి. బి. ఏ. పాస్ అయినవాళ్ళు అప్లై చేయొచ్చు. ఈరోజే నేను అప్లికేషన్లు తెప్పించాను. మరి మల్లికగార్ని గూడా అప్లై చేయమనండి."

"ఏం మల్లికా? అప్లై చేస్తావటే?"

## ఆరాధన!

నాకు రాదు కవిత్వం
నాకు తెలిసిందొకటే తత్వం
అందం పువ్వులా వికసిస్తుంటే
రాగం పరిమళంలా వెదజల్లుతుంటే
చూసి మురిసిపోడం
మురిసి అందంలో తడవడం
నాకు బాగా తెలుసు
అదురుతున్న పెదవులతో
రెపరెపమంటున్న గుండెల్లో
ఏదో అనుకుంటాను
అప్పుడు సొగసుగా నాట్యమాడుతూ
ఆ పద మధురిమలు
కలంలో కదులుతాయి
బహుశా అదేనేమో కవిత్వం?
నాకు తెలియదు అది
నాకు తెలియదు కవిత్వ తత్వం...
నాకు తెలిసిందల్లా ఒక్కటే తత్వం
అదే సౌందర్యారాధనం!

— రాజి

"అన్నయ్యను అడిగి!"

"అన్నయ్య మట్టుకు కాదంటాడటే! ఉద్యోగం చెయ్యమని ఎన్నిసార్లు అనలేదు?"

"అప్లై చెయ్యండి మల్లికగారూ! పరీక్షలకు వెళ్ళవచ్చు. తీరా ఉద్యోగం వచ్చినట్లు ఆర్డర్లు వస్తే ఇష్టంవుంటే చేరవచ్చు లేకుంటే మానుకోవచ్చు. అదీగాక బ్యాంక్ టెస్టుకు చదువుతుంటే మన బి. ఏ. నాలెడ్జికి పదును వస్తుంది. లేకుంటే క్రమంగా అన్నీ మర్చిపోతాం. ఒక హాబీగా వుంటుంది. కాలక్షేపం అవుతుంది గదా?!"

"నిజమేనండీ! మీరు చెబుతుంటే నాకూ ఇంటరెస్టు పుడుతున్నది. ఈ ఊరొచ్చాక మరీ బోరుగొడుతున్నది. కర్నూలులో నాకు ఎంతోమంది స్నేహితురాళ్ళున్నారు. అప్లికేషన్లు ఎప్పటిలోగా పంపాలి? అన్నట్లు మీరు అప్లై చేశారా?"

"ఇంకా లేదండీ!" అంటూ సంధ్య తన హేండ్‌బాగ్‌లోని అప్లికేషన్లున్న కవర్‌ను తీసి మల్లిక చేతిలో పెట్టింది.

మల్లిక కవర్ అందుకొని అప్లికేషన్లను తీసి పరిశీలిస్తున్నది.

"కావాలంటే ఈ సెట్ తీసుకోండి. మా బాబాయిగారిచేత నేను మరో సెట్ తెప్పించుకుంటాను" అన్నది సంధ్య.

"ఏమ్మా?..." అంటూ మల్లిక తల్లి వంక చూసింది.

"తీసుకో అమ్మా! తీసుకో! బంగారుతల్లి! ఇల్లు వెతుక్కుంటూ వచ్చింది. తన చేతులతో నీకు అప్లికేషన్‌లు ఇచ్చింది. ఏ చేతిలో ఏం మహత్తు ఉందో? మీ అన్నయ్యకు గూడా, మీ నాన్నతోపాటు పనిచేసిన డిప్టీ కలెక్టరు రాజారాంగారు పంపిన అప్లికేషన్లవల్లనే ఉద్యోగం వచ్చింది. అంతకుముందు ఎన్ని ఉద్యోగాలకు అప్లై చేసినా ఉద్యోగం వచ్చిందా? మంచి మనసున్నవాళ్ళు, ఇచ్చింది ఏదీ కాదనగూడదు" అన్నది మల్లిక తల్లి.

"ఏమండి? సంధ్యారాణిగారూ! తీసుకోమంటారా? మీకు ఇబ్బంది కలుగదుగదా?"

"ఏం ఇబ్బంది లేదండీ! మా బాబాయిగారితో మాట చెప్తే, మరో సెట్ నాకు క్షణాల మీద వస్తుంది!"

"చాలా థాంక్సండీ!"

"నో మెన్షన్ ప్లీజ్! అప్లై చేయండి! మీకు ఉద్యోగం తప్పకుండా వస్తుంది!"

"అమ్మా! మాట్లాడుకుంటూ ఉండండి! కాఫీ పెట్టుకొస్తాను!" అంటూ కుర్చీలోనుండి లేచింది మల్లిక తల్లి!

"భలేవారేనండి మీరు! ఎండలో వచ్చిన నాకు, కుర్చీ ఇచ్చి కూర్చోబెట్టారు. ఫ్యాన్ వేశారు. మంచినీళ్ళిచ్చి, కన్నతల్లిలాగా తియ్యని మాటలు చెప్పారు. ఇంకా కాఫీగూడా త్రాగి మిమ్ములను ఇబ్బందిపెట్టాలా నేను?"

"ఏం ఇబ్బందిలేదమ్మా! క్షణంలో కాఫీ పెట్టుకొస్తాను!" అంటూ మల్లిక తల్లి వెళ్ళిపోయింది వంటింట్లోకి.

"మీ అమ్మగారు చాలా మంచివారు! చాలా మంచి మనస్సు! మెత్తని హృదయం! మల్లికగారూ! మీరు చాలా అదృష్టవంతులు! అమ్మగారి పేరేంటి?"

"భ్రమరాంబ! నాకు భగవంతుడు చేసిన మేలు అదే! అమ్మా, అన్నయ్య నన్ను ప్రాణంగా చూస్తారు. నాకు పదేళ్లప్పుడు నాన్నగారు పోయారు. నాన్నగారు పోయినతరువాత, నేను ఎంతగా దుఃఖించానో ఎవ్వరికీ తెలియదు. అమ్మా! అన్నయ్యల ప్రేమ లేకుంటే, ఏమై పోయేదాన్నో?"

"చ్! చ్! చ్! చాలా దురదృష్టం మల్లికగారూ! అంత చిన్న వయస్సులో తండ్రి పోవడం దారుణం! చిన్నపిల్లలను పెంచి పోషించి ప్రయోజకులను చేయడానికి ఎన్నెన్ని బాధలు పడ్డారో మీ అమ్మగారు?"

"చాలా బాధలు పడిందండీ! మా నాన్నగారు డిప్టీ తాశిల్దారుగా పనిచేసేవారు. వారు హఠాత్తుగా చనిపోయారు. అక్కడినుండీ మా కష్టాలు ప్రారంభం అయ్యాయి. మా అమ్మ పుట్టెడు దుఃఖాన్ని నెత్తిన వేసుకుని, మమ్ములను కంటికి రెప్పలాగా కాపాడింది. ఉన్న కాస్త పొలం, ఇల్లూ అమ్మి మమ్ములను చదివించింది. దాదాపు రెండేండ్లకింద అన్నయ్యకు, ఉద్యోగం వచ్చేదాకా ఎన్నో కష్టాలు పడ్డాము. అయినవాళ్ళు, బంధువులు, మాయందు దయ వహించక, ఇంకా బాధించారు."

"అదేంటండీ! అంత కష్టంలో వున్న, మిమ్ములను బంధువులుగూడా బాధించారా?!"

"అవునండీ! చెప్పినా ఎవ్వరూ నమ్మరు. మా మేనమామ ఒకడున్నాడు. వాడికి ఒక మూగి కొడుకున్నాడు. నేను ఇంటర్ పాస్ అయ్యాక,

[ 32వ పేజీ చూడండి ]

## కల్యాణ చక్రవర్తిలో లా పాయింట్ బదులు లవ్ పాయింటు !

కల్యాణ్ (కృష్ణంరాజు) లా బుక్ చదువుతున్నాడు శ్రద్ధగా. చక్రవర్తి (కృష్ణంరాజు) "నమస్కారం, లాయర్‌గారూ!" అంటూ వచ్చి కూర్చున్నాడు చెప్పడానికి తటపటాయించసాగాడు.

"ఏదైనా పనిమీదొచ్చావా ?"

"పనిమీద కాదు; సలహా కోసం వచ్చాను, సార్ ! అదేమిటో నాకు సిగ్గేస్తోంది, సార్ !"

"సిగ్గెందుకయ్యా ? చెప్పు. ఏం కావాలి ?"

"లాయర్లు ఎందరికో సలహాలిచ్చి సహాయం చేస్తారు. హాడిచేసినవాళ్ళకి కూడా సలహాలిస్తారు కదా ? లవ్ చేసినవాళ్ళకి ఇవ్వకపోతారా అన్న ధైర్యంతో వచ్చాను, సార్ ! ఆ ప్రేమ నేను ప్రేమించడంతోనే ఆగిపోయింది, సర్ ! అట్నుంచి ప్రేమా దోమా ఏదీ మొదలుకాలేదని నా అనుమానం. ఇప్పుడే మీకా పిల్ల పేరు చెప్పేశాననుకోండి రేపు ఆ పిల్ల ప్రేమించనుపొమ్మంటే – మీ ముందు నవ్వులపాలైపోనూ ? ఆ అమ్మాయి నా ప్రేమకు పాసుమార్కులిచ్చి పచ్చజండా ఊపిన తర్వాతే మీకా పేరు చెప్తా, సార్ !"

"సరే... అలాగే కానియ్. ఇంతకీ, సలహా ఏ విషయంలో కావాలి నీకు ?"

"ఆ పిల్ల నాతో కాస్త చనువుగా మాట్లాడుతుందే తప్ప – సినిమాల్లో చూపించేట్టు 'నిన్ను ప్రేమిస్తున్నాను చక్రీ! నా గుండెను తెలగపిండిలా చేశావ్ చక్రీ !' అని ఇంతవరకు ఒక్క మాట కూడా అనలేదు. అసలాపిల్ల నన్ను ప్రేమిస్తూందో–లేదో ఎలా సార్ తెలుసుకోవడం ?"

"చాలా గట్టి సమస్యే తెచ్చావ్, చక్రవర్తీ ! లా పాయింట్లు తప్ప లవ్ పాయింట్లు తెలీవే నాకు ?... నేను నీకేం సలహా ఇవ్వగలను చెప్పు !"

"అమ్మమ్మ ! మీరామాటంటే నేనొప్పుకోను సార్. ఇన్ని పుస్తకాలు చదివారు కదా ? చిన్న పాయింటు విసరండి. అందుకుపోతాను."

"నువ్వన్నట్టు ఆ సినిమాల్లోనే చూపిస్తారు కదా – ఓ ఆడపిల్లని ప్రమాదం నుంచి తప్పిస్తే, ఆ పిల్ల అర్జంట్‌గా ప్రేమించెయ్యడం మొదలెడ్తుందని..."

"ఆహాహా ! చాలు, గురూజీ ! ఈ పాయింటు చాలు. ఇక ఈ రూట్లో నరుక్కెళ్ళిపోతాను. వస్తాను, సార్ ! ఇక టైమ్ వృథా చేయను," అంటూ సంతోషంతో లేచి, నమస్కరించి నిష్క్రమించాడు చక్రవర్తి.

కల్యాణ్ మళ్ళీ చేతిలోని పుస్తకంవంక దృష్టి మరల్చాడు.

కృష్ణంరాజు ద్విపాత్రాభినయం నిర్వహించే నవజ్యోతి పిక్చర్స్ "కల్యాణ చక్రవర్తి" వన్నెల చిత్రాన్ని ఎం. ఎస్. కోటారెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. నాగేశ్వరరావు నిర్మించారు.



'ఆరని మంటలు'లో సుభాషిణి

# సినిమా విశేషాలు

—జి.పి.జి

## "రౌడీ రాముడు – కొంటెకృష్ణుడు"

ఎన్. టి. రామారావు సమర్పించే ఈ చిత్రంలో ఆయన, ఆయన తనయుడు బాలకృష్ణ అన్నదమ్ములుగా ప్రధాన పాత్రలు నిర్వహిస్తున్నారు. వారి సరసన శ్రీదేవి, రాజ్యలక్ష్మి నాయికలు. సత్యనారాయణ, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్ ప్రభృతులు తదితర తారాగణం. కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో జనవరి 1 న రామకృష్ణ సినీ స్టూడియోస్‌లో సెట్స్‌కు వెళ్ళే ఈ వన్నెల చిత్రానికి జంధ్యాల సంభాషణలకర్త, చక్రవర్తి సంగీత దర్శకుడు.

## గూడవల్లి రామబ్రహ్మం విగ్రహ ప్రతిష్ఠాపన కమిటీ కృషికి ఎన్. టి. ఆర్. తోడ్పాటు

విజయవాడలో స్వర్గీయ రామబ్రహ్మం విగ్రహ ప్రతిష్ఠాపన కమిటీ కొంత మొత్తాన్ని వసూలు చేసింది. తదుపరి కార్యకలాపాలకు అనివార్య కారణాలవలన అంతరాయం కలిగింది. ఈ సందర్భంగా కమిటీ తరఫున 'మన సత్యం' డాక్టర్ ఎన్. టి. రామారావుగారిని కలువగా ఆయన స్వయంగా వెయ్యిన్నూటపదహార్లు విరాళమివ్వడమే కాకుండా తను నటిస్తున్న చిత్ర నిర్మాణ సంస్థలచే విరాళాలు సేకరించి, కమిటీ కృషికి తోడ్పడ్డారు. కె. సి. ఫిలింస్ 1,116. లక్ష్మీ ప్రొడక్షన్స్ 1,000. అనిల్ ప్రొడక్షన్స్, లక్ష్మివిష్ణు ప్రొడక్షన్స్, దేవీ ఫిలింస్ ప్రొడక్షన్స్, శ్రీ వెంకటేశ్వరామూవీ క్రియేషన్స్, స్టైల్‌ఎంటర్ ప్రైజెస్ రూ. 558 చొప్పున, విజయా పిక్చర్స్ 501, సత్యసాయి ప్రొడక్షన్స్ 500రూపాయలు.

"ఈ సహాయాన్నేకాక మరికొంత విరాళాన్ని కూడా సేకరిస్తానని వాగ్దానమిచ్చిన కళాప్రపూర్ణకు మా కృతజ్ఞతలు. శ్రీ అన్నపూర్ణ పిక్చర్స్ దుక్కిపాటి మధుసూదనరావుగారు 1,116 విరాళమిచ్చి, అవసరమైతే మరో 1,116 ఇవ్వగలనని వాగ్దానం చేశారు. వీరితో చేరి రూ. 250/– విరాళమిచ్చిన డైరెక్టర్ దాసరి నారాయణరావుగారికి. విజయలక్ష్మి మూవీస్‌వారికి మా కృతజ్ఞతలు," అన్నారు 'మన' సత్యం.

## నేషనల్ పార్టీ పురోగమనం

"నియంతృత్వ ధోరణిని ఎదుర్కొని, ప్రజాస్వామ్యాన్ని సుస్థిరం చేసే లక్ష్యంతోనే ఈ నేషనల్ పార్టీ నెలకొల్పబడింది," అన్నారు ఈ పార్టీ అధ్యక్షులు నటుడు దేవానంద్ నవంబర్ 18 న బొంబాయి శివాజీ పార్క్‌లో జరిగిన బహిరంగ సభలో శ్రీమతి విజయలక్ష్మి పండిట్, శ్రీ నాని పల్కీవాలా, పారిశ్రామికనేత శ్రీ రామకృష్ణబజాజ్, శ్రీ శత్రుఘ్నసిన్హా, శ్రీ విజయ్ ఆనంద్ ప్రభృతులు కూడా ప్రసంగించారు. "ఈ పార్టీకి అండగా వుంటామంటూ దేశంలోని నలుమూలలనుంచీ విద్యార్థులూ, అభ్యుదయగాములూ రాసే వందలాది ఉత్తరాలు మాకు ప్రతిరోజూ అందుతున్నాయి. ఇది కేవలం చలనచిత్ర పరిశ్రమకే పరిమితమైన పార్టీ కాదు. నేటి రాజకీయరంగంలోని కలుషిత వాతావరణాన్ని ప్రక్షాళనం చేసి, దేశాభ్యుదయానికి పాటుపడేవారిదే ఈ పార్టీ. ఐతే, ఎలెక్షన్ కమిషన్ ఆమోదించనందువల్ల ప్రతి అభ్యర్థీ 'స్వతంత్రుడు'గానే పోటీ చేస్తాడు," అన్నారు దేవానంద్. యువతరం మేల్కొని, నిరంకుశత్వాన్ని నిర్మూలించాలని ఉద్బోధించారు శ్రీమతి విజయలక్ష్మి పండిట్. "రాజకీయాలే వృత్తిగాగలవారిది, పదవీ వ్యామోహంగలవారిది కాదీ పార్టీ," అన్నారు పాల్కీవాలా. ఇంకా శత్రుఘ్నసిన్హా, అమ్జద్‌ఖాన్, విజయ్ ఆనంద్, రంజిత్, జి. పి. సిప్పీ ఉపన్యసించిన అనంతరం హేమమాలిని వందన సమర్పణ చేశారు.

జగన్మాతా ఆర్ట్స్

# శ్రీ వినాయక విజయము

దర్శకత్వం
కమలాకర కామేశ్వరరావు, B.A.

నిర్మాత
జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి

స్కోప్ & కలర్

సంగీతం: యస్.రాజేశ్వరరావు
సహనిర్మాతలు: ఎస్.ఎస్.స్వామి, పి.రాంబాబు
కథ-నిర్వహణ: బోణం ఆంజనేయులు



SREE PUBS

సీడెడ్: ద్వారకా ఫిలింస్
కర్ణాటక: అనంత్ మూవీస్





## అందాలరాశి లో అంతుతేలని సమస్య

బిన్నీ ఇంటర్నేషనల్ వారి ''అందాల రాశి'' సెట్‌లో రాజ్‌కుమార్ (రమేష్), లాయర్ (రావి కొండలరావు), రతి (రూప), గీత (శైలజ) ఉన్నారు కథ, స్క్రీన్‌ప్లే, నిర్మాణం, ఛాయ, దర్శకత్వ బాధ్యతలను నిర్వహిస్తున్న కె అర్. వి భక్త 'కెమెరా వ్యూఫైండర్' గుండా చూస్తూ, ''యాక్షన్ !'' అన్నారు

రమేష్ లాయర్‌గారూ ! మీప్లాన్ ప్రకారం పెళ్ళి కూతుర్ని దొంగలాగ ఎత్తుకొచ్చేశాను

లాయర్ . దొంగలాగంటా వేమిటయ్యా ? శ్రీకృష్ణుడు రుక్మిణిని ఎత్తుకొచ్చినట్లు, ఎత్తుకొచ్చావు. ఇక మీపెళ్ళి రుక్మిణీ కల్యాణం లాగ వైభవంగా జరిగిపోతుంది

రూప : లేదంకుల్ ! నాకు చాలా భయంగా ఉంది

లాయర్ : భయంకాదుటమ్మా ? ఇదేమన్నా సామాన్యమైన విషయమా ? మీ నాన్నగారి చర్య తీసుకుంటే, క్రిమినల్ లా ప్రకారం...

'అదృష్టవంతుడు'లో శ్రీదేవి, సత్యనారాయణ

గీత : ఆదేమిటి డాడీ, మళ్ళీ అలాగంటావ్?

లాయర్ : అనడానికేమీ లేదమ్మా తర్వాత కథ ఎలా నడిపించాలా అని ఆలోచిస్తున్నాను

రమేష్ · ఇప్పుడాలోచించేంత టైము లేదు సార్ ! వాళ్ళు రూప కనిపించలేదని ఏం చేసినా చెయ్యొచ్చు

### సినిమా

రూప : ఇప్పుడు మరేలా ? ఎక్కడ దాక్కోవాలి ?

లాయర్ : దాక్కోడం లాభం లేదమ్మా ఉండు ..లా పాయింట్ లాగుతాను.

—అని బుర్ర గోక్కుంటున్న లాయర్ క్లోసప్‌తో ఆ షాట్ ముగిసింది.

''రూప తండ్రి ఆమెను బలవంతంగా తన మేనల్లుడు రంగకిచ్చి పెళ్ళి చేయడానికి పూను కుంటాడు. ఆ గండం నుంచి గీత సహాయంతో తప్పించుకున్న రూపను లాయర్ దగ్గరికి రమేష్ తీసుకొస్తాడు,'' అని సందర్భాన్ని వివరించారు భక్త. త్వరలోనే ప్రతి ముఖ్య కేంద్రంలోని థియేటర్లకు చేరుకునే ఈ చిత్రానికి రమేష్ నాయుడు సంగీతం, సురేంద్రనాథరెడ్డి కూర్పు నిర్వహించారు.

### ప్రభు చిత్ర తొలి చిత్రం

''జనవరి 20 న మా హీరో కృష్ణంరాజు గారి జన్మదినోత్సవం. ఆరోజే 'ముకద్దర్‌కా సికిందర్' ఆధారంగా రాయపరాజుగారు నిర్మించే కలర్ పిక్చర్‌కు తొలిసారిగా దర్శకత్వం వహించ బోతున్నాను,'' అన్నారు సరిపెల్ల చిట్టిబాబు. జయసుధ, సుజాత, చిరంజీవి, సత్యనారాయణ, కె. వి. చలం, కాంతారావు, భీమరాజు యితర భూమికలు నిర్వహిస్తారు నవంబర్ 26 న శైలజ గానం చేసిన ఆత్రేయ గీతం రికార్డు చేయబడింది చక్రవర్తి సంగీత దర్శకుడు గొల్లపూడి సంభాషణలకర్త. విఎస్ఆర్.స్వామి ఛాయాగ్రాహకుడు. భాస్కరరాజు శిల్పం, సత్తిరాజు ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు.





## శివమెత్తిన సత్యంలో దాగని సత్యం

సత్యం (కృష్ణంరాజు) గొడవున్‌లో పెట్టెలు లెక్క చూసుకుంటున్నాడు. ఇంతలో ఎస్ ఐ ఆత్మ (సత్యనారాయణ) కానిస్టేబుల్స్‌తో వచ్చాడు.

'మీరటు ! మీరిటు వెళ్లండి !'' అని పోలీసుల్ని పురమాయిస్తున్న ఎస్. ఐ తో ''ఓ ! ఇన్‌స్పెక్టర్‌గారా ! గుడ్డు మార్నింగు సారూ ! గుడ్డుమార్నింగు. యేంటి యీవేసం ? యేంటిలా వచ్చారు ?'' అన్నాడు సత్యం

''ఈ పెట్టెల్లో ఏమున్నాయ్ ?''

''మందులు, సారూ, మందులు.''

''వీటిలో దొంగ సరుకు—స్మగ్లింగ్ సామాను ఉంది.''

''ఇన్‌స్పెక్టర్‌గారూ ! మీ రెక్కాడైనా, యెవర్నన్నా యీ మాటనండి. మా అయ్యగారిని మాత్రం కాదు. మా అయ్యగారంటే యేంటనుకున్నారు ?...నీతి—నిజాయితీ. .''

''అదే తెలుసుకుందామని...కానిస్టేబుల్ ! ఊఁ ఓపన్ ! ''

ఒక పెట్టె తెరవగా అందులో మందులే ఉన్నాయి

''చూశారా, సార్రూ, చూశారా ? యిప్పుడే మంటారు ? వీటిలో వున్నవి మందులా దొంగ సరకులా ? చెప్పండి, సారూ !''

ఇంతలో మరొక పెట్టెను తెరిచిన పోలీసు ''సార్, బంగారం ! '' అన్నాడు.

ఇంకో పోలీసు ''సార్! ఇక్కడ నల్లమందు!'' అన్నాడు.

'శివమెత్తిన సత్యం'లో కృష్ణంరాజు, జయసుధ

తెల్లబోయిన సత్యం వంక క్రీగంట చూశాడు ఎస్. ఐ.

హీరో కృష్ణంరాజు సమర్పిస్తూ ద్విపాత్రాభినయం నిర్వహించే ''శివమెత్తినసత్యం'' వర్ణచిత్రం షూటింగ్ నవంబర్ 30న చిక్‌మగళూర్‌లో పూర్తయినట్లు చెప్పారు డైరెక్టర్ వి. మధుసూదనరావు. అంతకు ముందు

'లక్ష్మి'లో విజయవాణి



మైసూరు బృందావన్ గార్డెన్స్‌లో కృష్ణంరాజు, జయసుధల మీద ఒక పాటను తీశారట. శారద, గీత, ప్రభాకరరెడ్డి, సారథి, మిక్కిలినేని, త్యాగరాజు, ప్రసాద్‌బాబు, సోమసుందర్ ఇతర భూమికలు నిర్వహించారు. ఆత్రేయ సంభాషణలు, జె. వి. రాఘవులు స్వరకల్పనలో గీతాలు రాశారు. వి. ఎస్. ఆర్. స్వామి, భాస్కరరాజు, వి. జగదీశ్, జి. జి. కృష్ణారావు నేపథ్యనిపుణులు. ''జనవరి 11న విడుదల చేస్తున్నాం,'' అన్నారు నిర్మాత జి సత్యనారాయణరాజు.

**''ఆటగాడు''**

ఎన్. టి. ఆర్ తో శ్రీ వేంకటేశ్వర మూవీ క్రియేషన్స్ బానర్‌లో తయారౌతూన్న వర్ణచిత్రానికి పై పేరు పెట్టినట్లు చెప్పారు నిర్మాత జి. రాజేంద్రప్రసాద్ శ్రీదేవి, జగ్గయ్య, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, నూతన్ ప్రసాద్, సావిత్రి పాల్గొంటున్నారు. ''డిసెంబర్ 9న ప్రారంభమైన చివరి షెడ్యూల్ డిసెంబర్ 22 కి పూర్తవుతుంది,'' అన్నారు డైరెక్టర్ తాతినేని రామారావు. ఎం. డి. సుందర్ కథకు సత్యానంద్ మాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, కన్నప్ప ఛాయ, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం తెర వెనుక హంగులు. ''జనవరి విడుదల,'' అని తెలియజేశారు ఈ చిత్రాన్ని సమర్పించే డి నీలమోహన్. నిర్వహణ ఎ. వెంకటరత్నం

[ 31వ పేజీ చూడండి ].

# వంటింటి కుందేలు



**ఎన్నో సంవత్సరాలక్రితం ఓ చక్కనిచుక్క వుండేది. ఆ అమ్మాయి పేరు లూసిందా. ఆమె తల్లిదండ్రులు గొప్ప ధనవంతులు. వాళ్ళు ఒక పెద్ద అందమైన భవనంలో వుండేవాళ్ళు.**

ఒకరోజున లూసిందా తల్లి చనిపోయింది. కొంతకాలం పోయాక, ఆమె తండ్రి మరొక ధనవంతురాల్ని పెళ్ళి చేసుకున్నాడు. ఆమెకు ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. ఒకరి పేరు బెర్తా, మరొకరి పేరు బ్రెండా. ఈ ఇద్దరు పిల్లలకు చిన్న పాటి వచ్చింది, అన్ని విషయాలలో లూసిందా తన చెల్లెళ్ళలో హాయిగా ఆడుకొంటున్న అనుకుంది. కాని పాపం, వాళ్ళిద్దరూ లూసిందాను దగ్గరికి రానిచ్చేవారు కాదు. లూసిందాను నానా అవస్థ పెట్టేవారు. ప్రతిక్షణం ఏడిపిస్తూ వుండేవారు. ఇంటి పనంతా ఆమెచేత చేసేవారు.

లూసిందాకు పని ఎప్పుడూ అయ్యేదికాదు. ఎంటింట్లో పని ఎంతకూ తెమిలేదికాదు. ఆమె ఎప్పుడూ వంటగదిలో పొయ్యి ముందరి కూర్చోవడం చూసి చెల్లెళ్ళు ఆమెకు వంటింటి కుందేలు అని పేరు పెట్టారు.

లూసిందా వంటగదిలోనే చింకిచాప పరచుకొని పడుకునేది. చెల్లెళ్ళుమాత్రం అద్దాలగదిలో, మెత్తని పరుపులమీద పడుకునేవారు. లూసిందా బట్టలు మసిపట్టి, చుట్టిగొట్టికుపోయివుండేవి. వాళ్ళుమాత్రం పట్టుబట్టలేసుకుని తిరిగేవారు.

నిజానికి ఎంతబట్టలుబాగోకపోయినా, లూసిందా చాలా అందంగా కనిపించేది. చెల్లెళ్ళు ఎంత ఖరీదైన దుస్తులు వేసుకున్నా అనాకారిగానే కనిపించేవారు. తమకన్నా లూసిందా చాలా అందమైనదని వాళ్ళకు చాలా అసూయగ వుండేది. అందువల్లనే వాళ్ళు లూసిందాను మరింత కష్టపెట్టేవారు.

ఒకరోజున రాజకుమారుడు తన మందిరంలో కన్యలకు నాట్యప్రదర్శన ఏర్పాటుచేసాడు. ధనవంతులైన కన్యలందరికీ ఆహ్వానాలు పంపించాడు.

బెర్తా, బ్రెండా రాజమందిరానికి వెళ్ళడానికి సిద్ధమయ్యారు. వాళ్ళకు అందమైన దుస్తులు కుట్టేపని లూసిందామీదే పడింది. ఒకప్రక్క ఇంటిపనిచేస్తూ, మరొకపక్క వాళ్ళకు అందమైన బట్టలు కుట్టింది. చెల్లెళ్ళిద్దరూ కొత్తదుస్తులు వేసుకుని, గుర్రపుబగ్గీ ఎక్కి వెళ్ళిపోయారు. లూసిందా వాళ్ళువెళ్ళినవంకే చూస్తూ వుండిపోయింది. తర్వాత వంటగదిలోకివచ్చి చాలాసేపు ఏడ్చింది. 'వాళ్ళలాగే తనకూ రాజమందిరానికెళ్ళే అవకాశం లేకుండాపోయిందికదా' అని విచారించింది.

ఆ సమయంలో వంటగదిలో గొప్పవెలుగు వచ్చింది. 'పాపా ! ఎందుకలా ఏడుస్తున్నావు ?' అన్నమాటలు విని లూసిందా తలెత్తి చూసింది. మల్లెపూవులాంటి తెల్లటిబట్టలతో ఒక దేవత కనిపించింది. ఆమెచేతిలో చిన్న మంత్రదండం వుంది. ఆమెను చూడగానే లూసిందాకు దుఃఖం ఆగలేదు. గట్టిగా ఏడ్చింది. 'నేనుకూడా రాజమందిరానికి వెళదామనుకున్నాను. కానీ నాకా అదృష్టం లేకుండాపోయింది' అంది.

'అంతేకదా ! నేనునీకు తల్లిలాంటిదాన్ని. నేను చెప్పినట్టుచెయ్యి, క్షణాల్లో నువ్వు రాజమంది



రంలో వుంటావు.' అంది. లూసిందా అలాగే అంటూ తలవూపింది.

'నీళ్ళగుండిగ తీసుకెళ్ళి గుమ్మం బయట పెట్టు.' అంది దేవత. ఆమె ఎందుకలా చెప్తున్నదో లూసిందాకు అర్థంకాలేదు. అయినా ఆమె చెప్పినట్టు చేసింది. దేవత తన దగ్గర వున్న మంత్రదండంతో దానిని గుండిగమీద తిప్పింది. ఆశ్చర్యం! ఆ గుండిగ ఒక గుర్రపుబగ్గీగా మారిపోయింది.

'ఇప్పుడు ఎలుకలబోను పట్టుకురా!' అంది దేవత. లూసిందా గదిలో వున్న ఎలుకలబోను తీసుకొచ్చింది. అందులో ఏడు చిట్టెలుకలు వున్నాయి. దేవత తన మంత్రదండాన్ని ఎలుకల బోనుకు తాకించింది. ఏడు ఎలుకలు ఏడు తెల్లటి గుర్రాల్లాగ మారిపొయ్యాయి. లూసిందా ఆశ్చర్యపోతూ నిలబడింది.

'వెళ్ళి ఒక పుంజును, ఆరు కోడిపెట్టలను తీసుకురా!' అంది దేవత. లూసిందా దొడ్లో వున్న ఒక పుంజును, ఆరు కోడిపెట్టలను తీసుకువచ్చింది. దేవత మంత్రదండంతో పుంజును ఒక గుర్రపుబండి తోలేవాడిగాను, ఆరు కోడిపెట్టలను ఆరుగురు సేవికలుగానూ మార్చింది.

'నువ్వు ఇక రాజమందిరానికి వెళ్ళొచ్చు!' అంది దేవత. 'నా జీవితంలో ఇంత అందమైన రోజు ఎప్పుడూ రాలేదు. ఇప్పుడే రాజమందిరానికి బయలుదేరుతాను' అని లూసిందా సంతోషంగా అరిచింది. కానీ వెంటనే తన దుస్తులవంక చూసుకొని విచారించింది. 'ఈ మసిబట్టలతో రాజమందిరానికి ఎలా వెళ్ళను?' అంది.

దేవత చిరునవ్వుతో తన మంత్రదండాన్ని లూసిందా మీదుగా తిప్పింది. అంతే! ఆమె మసిబట్టలు అద్భుతమైన బట్టలుగా మారిపోయాయి. ఆమె దుస్తులు వజ్రాలతో మెరిసిపోయినయి. ఆమె కాళ్ళకు అందమైన చెప్పులు వచ్చాయి. దేవత గుర్రపుబగ్గీ తలుపుతీసి, 'ఇక బయలుదేరు. రాజమందిరంలో హాయిగా గడుపు. కానీ ఒకటి మాత్రం గుర్తుంచుకోవాలి. అర్ధరాత్రిలోపు నువ్వు రాజమందిరం నుండి బయలుదేరాలి. లేకపోయినట్లయితే, గుర్రపుబగ్గీ గుండిగగా మారిపోతుంది. బండివాడు పుంజుగాను, సేవికలు కోడిపెట్టలుగాను మారిపోతారు. ఈ గుర్రాలు చిట్టెలుకలుగా మారిపోతాయి. నీ మెరిసే బట్టలు మామూలు మసిబట్టలయిపోతాయి' అంది.

'నువ్వు చెప్పింది బాగా జ్ఞాపకం పెట్టుకుంటాను' అంటూ గుర్రపుబగ్గీ ఎక్కింది. బండి పరుగులుతీసింది రాజమందిరంవైపు.

లూసిందా గుర్రపుబగ్గీ దిగింది. రాజమందిరంలోకి అడుగుపెట్టింది. మందిరంలో వున్నవాళ్ళంతా ఆశ్చర్యంగా లూసిందావేపు చూడడం మొదలుపెట్టారు. 'ఆహా! ఏమిఅందం! అబ్బో! ఎంత అద్భుతమైన దుస్తులు!' అంటూ అనుకోసాగారు.

రాజకుమారుడు లూసిందాను చూసి ఆమెను ఒక్కక్షణంకూడా విడిచిపెట్టలేదు. 'ఈ మందిరంలోవున్న కన్యలకంటే ఈమె అందం గొప్పది.





సుకుంటే ఈమెనే పెళ్ళిచేసుకోవాలి' అనుకున్నాడు.

నాట్య ప్రదర్శన జరిగింది. కన్యలందరూ నాట్యం చేసారు. లూసిందాకూడా నాట్యంచేసింది. తర్వాత పెద్దవిందు జరిగింది.

అప్పటికి అర్ధరాత్రి కావొచ్చింది. లూసిందాకు వెంటనే దేవతచెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. ఇక ఒకక్షణంకూడా ఆలస్యం చేయకుండామందిరం బయటకు పరుగెత్తింది. అలా అనుకోకుండా లూసిందా పరుగెత్తడం చూసి రాజకుమారుడు కూడా వెంట పరుగెత్తాడు. కానీ ఆమెను పట్టుకోలేకపొయ్యాడు. లూసిందా అలా బయటకు పరుగెడుతున్నప్పుడు ఒకకాలిచెప్పు జారిపోయింది. అది తీసుకునే వ్యవధిలేక లూసిందా పరుగెత్తుకెళ్ళి గుర్రపుబగ్గీలో కూర్చుంది. బగ్గీ వేగంగా కదిలింది.

రాజకుమారుడికి లూసిందా కాలిచెప్పు దొరికింది. దానిని జాగ్రత్తచేసాడు.

మరునాడు లూసిందా వంటగదిలో వుండగా చెల్లెళ్ళిద్దరూ మాట్లాడుకోవడం విన్నది.

'రాత్రి రాజమందిరానికి ఒక అందమైన అమ్మాయి వచ్చింది చూసావా? రాజకుమారుడు ఆ అమ్మాయంటే చాలా ఇష్టపడుతున్నాడట!'

'ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాడట!'

'కానీ ఆ అమ్మాయి అర్ధరాత్రి అవుతుండగా అదృశ్యమయిపోయిందిగా!'

'రాజకుమారుడికి ఆమె పాదరక్షల్లో ఒకటి దొరికిందికదా, దాని సహాయంతో రాజ్యంలో ఎక్కడ వున్నా ఆ అమ్మాయిని వెతికిపట్టుకుని పెళ్ళాడుతాడట!'

ఈ మాటలన్నీ లూసిందా విని చాలా సంతోషించింది.

రాజకుమారుడు లూసిందాకోసం దేశమంతా వెతికించాడు. ఎంతోమంది ఆ పాదరక్ష నాదంటే నాదని ముందుకు వచ్చారు. రాజకుమారుడు వాళ్ళల్లో ఎవరూ లూసిందాలాంటి అమ్మాయి లేకపోవడంచూసి విచారించాడు.

రాజ్యంలో ప్రతిఇంటికి వెళ్ళి, ఆ పాదరక్ష ఎవరికి సరిపోతే ఆ అమ్మాయిని తీసుకొనిరమ్మని తన భటులకు ఆజ్ఞాపించాడు రాజకుమారుడు. భటులు పాదరక్ష పుచ్చుకుని బయలుదేరారు.

లూసిందా, ఆరోజు రాజకుమారుడు మెచ్చింది తనేనే అని అరిచిచెపుదామనుకుంది. కానీ తన మసి





# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంప దలచుకున్నవారు. సంపాదకుడు. ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొ వడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి— హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని తిప్పి పంపబడాలని కోరుకునే వారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం విచారించడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయ వలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, విన రంగా వ్రాయండే. వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్ధ' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అవి పద్ధ "ప్రతు"లన— కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.

## వంటింటి కుందేలు

బట్టల అవతారంచూసి, ఆ విషయం ఎవరూ నమ్మరు అనుకుని మౌనంగా వుండిపోయింది.

భటులు అన్ని చోట్లా తిరిగి చివరకు లూసిందావున్న ఇంటికి వచ్చారు. వాళ్ళురావడం తోనే చెల్లెళ్ళు ఇద్దరూ ఎంతో హడావుడి చేసారు. ఆ చెప్పు నాదంటేనాదని భటులతో చెప్పారు. భటులు మొదట పాదరక్షను బెర్తాకు వేసి చూసారు. కానీ ఆమె కాలు అందులో సరిపోలేదు. బెర్తా తన కాలు ఆ పాదరక్షలో ఇరికించడానికి ప్రయత్నించింది.

బ్రెందాకు కూడా వేసి చూసారు. ఆమెకు కూడా ఆ పాదరక్ష సరిపోలేదు. 'ఇక లాభంలేదు, చివరకు మిగిలిపోయిన ఈ అమ్మాయిలకు కూడా ఈ పాదరక్ష సరిపోలేదు. ఇక ఈ దేశంలో ఎవరు మిగిలివున్నారు ?' అనుకున్నారు భటులు.

'మీ ఇంట్లో ఇంకా ఎవరైనా కన్యలున్నారా?' అడిగారు భటులు.

'ఎవరూ లేరు !' అన్నారు చెల్లెళ్ళు. అదే సమయంలో లూసిందా వంటగది గుమ్మం దగ్గర నిలబడి భటులను చూసింది. భటులు ఆమెను చూసి 'నువ్వు ఒక్కదానివే మిగిలావు. ఈ పాదరక్ష నీకు సరిపోతుందోలేదో చూడనివ్వు!' అన్నారు.

'అదొక పిచ్చిమాలోకం. దానికెందుకు సరిపోతుంది ఈ పాదరక్ష!' అన్నారు చెల్లెళ్ళు.

'మా విధి మేము నిర్వర్తించాలి !' అంటూ భటులు లూసిందాను పిలిచి ఆమె కాలి పాదానికి పాదరక్ష తొడిగారు. ఆశ్చర్యమేమిలేదు. ఆ పాదరక్ష ఆమెకు సరిగ్గా సరిపోయింది. అది ఆమె పాదరక్షేకదా !

భటులకు ఎంతో ఆశ్చర్యమేసింది. వారు చాలా సంతోషించారుకూడా--చివరకు రాజకుమారుడి ప్రయత్నం ఫలించినందుకు.

ఆమెను వెంటనే తమతో రాజభవనానికి బయలుదేరమన్నారు. చెల్లెళ్ళు ఇద్దరూ, తమ తప్పులను మన్నించమని లూసిందాను వేడుకున్నారు. రాజకుమారుడితో చెప్పి తమను శిక్షిస్తుందేమోనని భయపడ్డారు. కానీ లూసిందా నవ్వి 'మీ మీద నాకేమీ కోపంలేదు.' అంది. భటులు ఆమెను రాజకుమారుడిదగ్గరకు తీసుకెళ్ళారు.

లూసిందా రాజమందిరంలో అడుగుపెట్టగానే మళ్ళాదేవత ప్రత్యక్షమయింది. ఆమె లూసిందాకు పూర్వంకంటే ఎంతో అందంగా కనపడేట్టుగా దుస్తులను మార్చింది. దేవత ఒక్క లూసిందాకు మాత్రమే కనపడింది. మిగతా భటులకు ఆమె కనిపించలేదు.

రాజకుమారుడు లూసిందాను చూసి సంతోషం పట్టలేకపోయాడు. పరుగున ఎదురు వచ్చి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. రాజకుమారుడికి లూసిందాకు అతివైభవంగా వివాహం జరిగింది. వారిద్దరూ హాయిగా కాలం గడిపారు.

[చార్లెస్ పెరాల్ట్ ఇంగ్లీషు కథ ఆధారంగా]

— బాబు

( గత సంచిక తరువాయి )
















[ఇంకా ఉంది]

కృష్ణంరాజు

సమర్పించు



రాధాకృష్ణా మూవీస్

# శివమెత్తిన సత్యం

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: వి. మధుసూదనరావు

నిర్మాత: జి. సత్యనారాయణరాజు

అన్నపూర్ణా ఫిలింస్

ANNAPURNA



'ఛాలెంజ్ రాముడు'లో ఒక దృశ్యం

## సృష్టిరహస్యాలు లో అసలు రహస్యం

'మీరు ఏమీ అనుకోక పోతే ఒక్కటడుగుతాను,'' అంది రాధ.

ప్రసాద్ (జగ్గయ్య), ఆమె కళ్ళల్లోకి చూశాడు ఆమెలో అమాయకత్వం తప్ప మరేమీ కనిపించలేదు ''అడుగమ్మా! ఈ ఇంటికి దీపం పెట్టిన తల్లివి నువ్వు అందరి ఆలనా పాలనా చూసే అన్నపూర్ణవు అడుగమ్మా!''

''ఇంతగా చదువుకున్న వారు పది మందికి జ్ఞానం పంచిపెట్టేవారు మీరు పెళ్ళి చేసుకోకపోవడం వెనుక - బలమైన కారణం ఉండే ఉంటుంది అయినా, ఈ వయస్సులో అత్తగారు - తల్లిగా ఒక్క కనీసపు కోర్కె కోరుకోవడం - అదే, మీరు పెళ్ళి చేసుకోవాలనడం—''

'మహాలక్ష్మి'లో వాణిశ్రీ



[ 25వ పేజీ తరువాయి ]

ప్రసాద్‌లో ఆవేదనా తరంగాలు ఉవ్వెత్తున లేచాయి. ''రాధా! అందరిలాగే నేనూ మనిషినే అమ్మా! నాకూ రంగుల ప్రపంచం చూడాలనే ఉండేది అయితే ఆల్‌రైట్. ఇంతకాలంగా నాలో నేను అణుచుకుంటూ దాచుకున్న బాధను నీకు చెప్పుకొని ఉపశమనం కలిగించుకుంటాను చరిత్రలో ఇది కొత్తకథ కాదు కాని, నాకు మాత్రం ఇది కొత్త చరిత్రే. సరస్వతిని నేను మనిషిగా చూడలేదు ఆమె నా పాలిటి దేవత ఆమెను ప్రేమించాను ఆరాధించాను ఆమెకే అంకితమయ్యాను రూపానికీ, గుణానికే కాదు, ఆమె సంగీత సరస్వతి కూడా ''

డైరెక్టర్ ప్రతాప్ ''ఆ తర్వాత 'ఈవీణ నా ప్రాణమే' అంటూ సరస్వతి వీణపాటతో ఫ్లాష్ బాక్ మొదలవుతుంది,'' అన్నారు.

''సృష్టిరహస్యాలు'' వన్నెల చిత్రాన్ని సమర్పించే రచయిత డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు ''రోజా నా దగ్గరికి ఎంతో మంది పేషెంట్లు వస్తూ ఉంటారు. ఎన్నో రహస్యాలు నాకు తెలుస్తూ ఉంటాయి. అలా తెలిసిన నిజాలు—సాంఘిక సమస్యలు, శాస్త్రీయ సమస్యలు గనుక—ఆయా సమస్యలన్నీ ఒక కథలో ఇమిడ్చి, ఈ 'సృష్టిరహస్యాలు' తీయాలనిపించింది. తీశాం. ఏవిధమైన అభ్యంతరాలు లేకుండా సెన్సారయింది. త్వరలో విడుదల చేయబోతున్నాం,'' అన్నారు.

శ్రీ వెంకటసాయి పిక్చర్స్ పతాకంలో కె. రాంబాబు నిర్మించిన ఈ చిత్రంలో సుధాకర్, రవికాంత్, మధుబాబు, గరగ, అంజలీనాయుడు, విజయలక్ష్మి, మద్దాలి సుశీల, పి. హెచ్. లక్ష్మి పాత్రధారులు.



## * * సినిమా విశేషాలు * *

### దాసరి ఏకలవ్య శిష్యుడు

''నేను దాసరిగారికి ఏకలవ్య శిష్యుణ్ని,'' అన్నారు డైరెక్టర్ టి. ఎల్ వి. ప్రసాద్ ఈ యువకుడు దర్శకత్వం వహించిన ''కుడి ఎడమైతే'' వన్నెల చిత్రం శతదినోత్సవం డిసెంబర్ 21 న మద్రాసు న్యూ వుడ్‌లాండ్స్‌లో జరుగుతుంది ''హీరో ఎన్ టి రామారావుగారు అధ్యక్షత వహిస్తారు మా నాన్న గురువుగారు శ్రీ ఎల్. వి ప్రసాద్ మొమెంటోలను కళాకారులకు, సాంకేతిక నిపుణులకు అందజేస్తారు నా గురువుగార్లు శ్రీ వి మధుసూదనరావు, శ్రీ కె హేమాంబరధరరావుగార్లు ఉపన్యసిస్తారు,'' అన్నారు టి ఎల్ వి. ప్రసాద్

### గూఢచారి 117

కృష్ణ హీరోగా చాలాకాలం క్రితం డూండీ నిర్మించిన ''గూఢచారి 116'' చిత్రానికి యం మల్లికార్జునరావు దర్శకత్వం నెఱపిన విషయం పాఠకులకు ఇంకా జ్ఞాపకం వుండి వుంటుంది ఇప్పుడు వీళ్ళిద్దరి కాంబినేషన్‌తో నవ చిత్ర ఇంటర్నేషనల్ ''గూఢచారి 117'' అనే వన్నెల చిత్రాన్ని జపాన్, హాంకాంగ్ దేశాల్లో నిర్మిస్తుంది ''మార్చిలో షూటింగ్ ప్రారంభమై అక్టోబర్‌కు పూర్తవుతుంది,'' అన్నారు నిర్మాతలు సనత్‌కుమార్, నారాయణ బాబు కృష్ణ హీరోగా ఈ సంస్థ నిర్మిస్తున్న తొలి చిత్రం ఇప్పటికి రెండు రీళ్ళు పూర్తయింది మార్చిలో విడుదల

'పగటికలలు'లో జయమాలిని





'కక్ష' లో మోహన్‌బాబు, శోభన్‌బాబు

## రిజిష్టర్ చేయబడిన కొత్త చిత్రాల పేర్లు

తిరుపతి పిక్చర్స్ "ఆరేసుకోబోయి పారేసు కున్నాను", అభ్యుదయ చిత్ర "గిరుల్లో నరులు", శ్రీ వాసవి ప్రొడక్షన్స్ "కలియుగ కృష్ణుడు", శ్రీ శారదాంబ ఫిలిమ్స్ "ఆశాలత", గోపాల్

### సినిమా

కంబైన్స్ "మిథున", భాగ్యలక్ష్మి క్రియేషన్స్ "కలలుగన్న రాధ, చెలికాడు", ప్రభ ప్రొడక్షన్స్ "కాంచనగంగ", తిరుపతి ఇంటర్నేషనల్ "పిసినిగొట్టు పిచ్చెమ్మ", శ్రీ కవిత చిత్ర కంబైన్స్ "మినిష్టర్ మీనాక్షి", తిరుపతి ప్రొడక్షన్స్ "భగవాన్", ఆదర్శ ఫిలిమ్ డెవలప్‌మెంట్ సొసైటీ "పన్నీటి జల్లు", ఆనంద్ సినీ ఎంటర్‌ప్రైసెస్ "అమాయకుడి అగచాట్లు", నవజ్యోతి కంబైన్స్ "వసువుతాడు", గౌరీశ్వరి ఆర్ట్స్ "సిందూరం", రెడ్డి ఆర్ట్ పిక్చర్స్ "బంగారు ప్రతిమ", చిన్ని కృష్ణ మూవీస్ "బెజవాడ బెబ్బులి, గజదొంగ", వి ఎం డి. ప్రొడక్షన్స్ "స్త్రీ చరిత్ర", కార్తికేయ ఫిలిమ్స్ "విషవలయం"



ఆ పిల్లవాడిని నాకు చేసుకోమని, అమ్మను ప్రాణం తీశాడు వాడు అమ్మా, అన్నయ్యా ససేమిరా ఒప్పుకోలేదు దాంతో వాడు మమ్మల్ని నాశనం చేయాలని పట్టుబట్టాడు. అన్నయ్యకూ, నాకూ పెండ్లి సంబంధాలు రాకుండా చూశాడు ఎవరొచ్చినా, ఏవో లేనిపోని కట్టుకథలు చెప్పేవాడు. వాడి బాధ భరించలేక ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాం, చాలా కష్టంమీద. ఇప్పుడు ప్రాణానికి హాయిగా వుంది."

సంధ్యకు, మల్లిక చెప్పిన విషయాలవల్ల మల్లిక భ్రమరాంబలమీద నిజంగా సదభిప్రాయం కలిగింది. వీరు పాలవలె స్వచ్ఛమైన మనస్సులు కలవారు కష్టసుఖాలు తెలిసినవారు అని అనుకుంది

ఆ తరువాత చదువులనుగురించి తాను చదువుకున్న కాలేజీలను గురించీ చాలాసేపు మాట్లాడుకున్నారు మల్లిక, సంధ్యలు

భ్రమరాంబ కాఫీ చేసుకొస్తానని వంటింట్లోకి వెళ్ళి, రెండు ప్లేట్లలో వేడివేడి ఉప్మా పట్టుకొచ్చి టేబుల్ మీద పెట్టింది

"ఇదేంటండీ ! ఉప్మా ? !..." అన్నది సంధ్య నిజంగానే ఆశ్చర్యపోయి, తన వాక్చాతుర్యానికి తనే చకితయై తన అదృష్టానికి తనే ఆశ్చర్య పడుతూ

## స్వయంవరం

[ 21వ పేజీ తరువాయి ]

"తినమ్మా తిను "

"ఇప్పుడెందుకండీ !"

"తీసుకోండి సంధ్యారాణిగారూ ! మీకోసం మేము ప్రత్యేకంగా చేసిందేమీలేదు ఎలాగూ ఐదున్నరకు అన్నయ్య వస్తాడు. అన్నయ్యకోసం రోజూ ఏదో టిఫెన్ చేస్తుంటాము తీసుకోండి ప్లీజ్ !" అన్నది మల్లిక

సంధ్య మరీ బెట్టుచేయక ఉప్మాను తినడం ప్రారంభించింది మల్లిక గూడా ఉప్మా తింటున్నది. సంధ్య వాచీ చూసుకుంది. నాలుగు గంటలు కావస్తున్నది. హరికృష్ణ ఇంటికి వచ్చేలోగానే తను వెళ్ళిపోవాలనుకుంది

'అమ్మా ! సంధ్యారాణిగార్ని వీలున్నప్పుడల్లా మనింటికి రమ్మనామ్మా !"

"అమ్మా సంధ్యారాణీ ! తప్పకుండా వస్తూవుండు" అన్నది భ్రమరాంబ

"అలాగేనండీ ! కానీ మీరు వచ్చినప్పుడల్లా ఇలా ... ఉప్మా ... టిఫెన్‌లాంటివి పెడుతుంటే నాకు ఇబ్బందిగా వుంటుందిగదా ?"

"అలా ఒక్కనాటికీ అనుకోకమ్మా ! ఎంత టిఫిన్ ? ఏం సంగతి ? మీ ఇంటికి వస్తే నీవు మాకు మర్యాదలు చేయవా ?"

"ఎంతమాటలండీ ! మీరు మా యింటికి వస్తే నాకు ఎంతో సంతోషంగా వుంటుంది అసలు మీరు విజయవాడ రండి ఒకసారి కనకదుర్గ అమ్మవారిని చూడవచ్చు కృష్ణానదిని చూడవచ్చు మా ఇంట్లో వుండి మీరు అన్నీ చూడవచ్చు నేను మీ వెంట వచ్చి అన్నీ చూపుతాను "

"చాలా సంతోషం అమ్మా ! మేమూ అమ్మవారిని చూస్తాం అని మొక్కుకున్నాము. త్వరలోనే రావలసిరావచ్చు, విజయవాడ "

సంధ్య మెదడులో కందిరీగల తుట్టెలాగా ఆలోచనలు రేగాయి ఈ మొగారు ఏమని మొక్కుకుంటుంది ? అబ్బాయికి విజయవాడ సంబంధం కుదిరితే అమ్మవారి దగ్గర కొచ్చి సేవించుకుంటాననుకుందా ? స్వరూపరాణి హరికృష్ణకు నచ్చిందా ? అమ్మా ! తల్లీ ! కనకదుర్గమ్మా ! నా ఆశ నిరాశ చేయకమ్మా ! అనుకుంది సంధ్య.

ఇలా ఐదుగంటలదాకా సంధ్య మల్లికా, భ్రమరాంబలతో మాట్లాడి "ఇక వస్తాను" అని సెలవు తీసుకున్నది వీలున్నప్పుడు తప్పక రమ్మని మల్లిక, భ్రమరాంబ మరీ మరీ చెప్పారు వెళ్ళబోయేముందు మల్లిక అప్లికేషను ఫీజు బాపతు డబ్బులు సంధ్యకు ఇచ్చింది.

[ ఇంకా వుంది ]

శ్రీ ఉదయ్ ఆర్ట్ పిక్చర్స్

# సమాజానికి సవాల్

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: యస్.పి. రాజారాం B.Sc. D.F.T.

నిర్మాత: యస్.పి. వెంకన్నబాబు

మాటలు: జంధ్యాల
సంగీతం: కె.వి. మహదేవన్
ఫొటోగ్రఫీ: పుష్పాల గోపీకృష్ణ
కూర్పు: వి. జగదీష్
ఆర్ట్: కె. రామలింగ్

LAKSHMI PUBS.

లక్ష్మీ ఫిలింస్



'కలియుగ రావణాసురుడు'లో ఒక దృశ్యం

## మాయగాడు

"కోతలరాయుడు" అనంతరం తమ్మారెడ్డి పి. కె. నిర్మించే వన్నెల చిత్రం "మాయగాడు". "ఒకే వ్యక్తి కొందరు యువతులను మాయచేసి పెళ్ళాడుతున్నటువంటి వార్త ఆమధ్య ఒకటి చదివా. దాని ఆధారంగా ఒక నీతిబోధకమైన ఇతివృత్తాన్ని ఎన్నుకున్నాను. చిరంజీవి, సీమతో పాటు నలుగురు కథానాయికలు వుంటారు," అన్నారు నిర్మాత. జనవరిలో షూటింగ్ ప్రారంభం.

## కదలివచ్చిన కనకదుర్గలో కందిపోయిన దుర్గ కరములు

చంద్రం, దుర్గ కంచాలముందు కూర్చున్నారు. పార్వతి వడ్డిస్తోంది. మౌనంగా కూర్చున్న కూతురువంక చూసి, "కలుపుకోమ్మా!" అన్నాడు చంద్రం.

"కారం, నాన్నా! కలుపుకోటానికి..." అంటూ చేతులు చూపించింది దుర్గ. బొబ్బలెక్కిన ఆ చేతులు చూసి భార్యాభర్తలు నిర్ఘాంతపోయారు. "అమ్మా, దుర్గా! ఏమిటమ్మా?" కంగారుగా అడిగాడు చంద్రం.

"శాంతమ్మగారింట్లో నీళ్ళు తోడితేమా—"

"అక్కడికి నువ్వెందుకెళ్ళావమ్మా?" పార్వతి కళ్ళు చెమ్మగిల్లినంత పనైంది.

"ఎందుకమ్మా, బాధపడతావ్? తల్లికి బిడ్డ సాయం చేయటం తప్పా?" అంది దుర్గ.

"నేను నిన్ను కళ్ళల్లో పెట్టుకొని చూసుకుంటూంటే – నీచేత నీళ్ళు తోడిస్తుందా ఆ శాంతమ్మ? దుర్గా, ఇంకెప్పుడూ ఆ ఇంటికి వెళ్ళకేం?" అన్నాడు చంద్రం.

"కష్టం అని – ఇష్టమైనవాళ్ళని దూరం చేసుకోకూడదు, నాన్నా!"

"ఈమాత్రం ఇంగితం ఆ పెద్దవాళ్ళకుంటే... సరేలే రామ్మా, నే తినిపిస్తాను," అంటూ తన కంచంలో కలిపిన అన్నం దుర్గ నోటికి అందించాడు చంద్రం.

ప్రసాద్‌బాబు, కవిత, బేబీ జయశాంతితో పాటు నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, రమణమూర్తి, పద్మనాభం, సూర్యకాంతం, జయవిజయ పాల్గొన్న సురేఖా ఎంటర్‌ప్రైజెస్ "కదలివచ్చిన కనకదుర్గ" వన్నెల చిత్రాన్ని కె. ఎస్. రెడ్డి దర్శకత్వంలో కె. ప్రకాష్ నిర్మిస్తున్నారు. పేరాల, సత్యం, ఎస్. ఎస్. లాల్, బి కందస్వామి, బి. ఎన్. కృష్ణ, ఎస్. పి. రంగారావు, కె. మురళీకృష్ణ తెరవెనుక కృషి చేస్తున్నారు.

## యువ చిత్ర తృతీయ చిత్రానికి రాఘవేంద్రరావు

"గోరింటాకు" అనంతరం నరసింహం నాయుడు సమర్పణలో కె. మురారి నిర్మించే వన్నెల చిత్రానికి కె రాఘవేంద్రరావు దర్శకుడు. మే నుంచి జులై వరకు చిత్ర నిర్మాణం జరుగుతుంది.



'సుబ్బారాయుడు – సుబ్బలక్ష్మి'లో నూతన్‌ప్రసాద్, నాగభూషణం



'సంఘం చెక్కిన శిల్పాలు'లో చంద్రమోహన్

★★★

## విదేశాలలో ఎస్.పి టి. ఫిలిమ్స్ చిత్రం

డైరెక్టర్ శ్రీధర్ తమ్ముడు సి. వి. రాజేంద్రన్ 37 తమిళ చిత్రాలను డైరెక్టు చేశారు. ఇప్పుడు ఆయన దర్శకత్వంలో తెలుగు, తమిళ భాషల్లో ఒక చిత్రం షూటింగ్ అమెరికా, జర్మనీ, హాలెండ్, ఫ్రాన్స్, బెల్జియమ్‌లలో జరిగింది. రతి, కమల్‌హాసన్ పై బెల్జియం, హాలెండ్, జర్మనీ లోని రైన్ నది ప్రాంతాల్లో తీసిన రెండు గీతాలనూ, కొన్ని ఫైట్స్‌నూ ఇటీవల పత్రికలవాళ్ళకు ప్రత్యేకంగా ప్రదర్శించి చూపారు 32 రోజులలోనే ఈ చిత్ర నిర్మాణం పూర్తయింది గుమ్మడి, రాజ్‌బాబు, రాజన్‌బాబు, అమెరికన్ కరాటే ఫైటర్ మిస్ టో, అమెరికన్ ఎటుహ టాంరస్పెల్స్ ఈ చిత్రంలో పాల్గొన్నారు ఆత్రేయ మాటలు, పాటలు రాశారు ఇళయరాజా సంగీతం, అశోక్‌కుమార్ ఛాయ, విరల్ కూర్పుతో పాటు బి అర్జునరావు సహకార దర్శకత్వం మరో విశేషం.

## సినిమా టైటిల్స్‌లో కొత్త చేర్పు

"ప్రొడక్షన్ డిజైనర్, ఫైనాన్షియల్ అడ్వయిజర్, నిర్వహణ, నిర్మాణత" లాంటి పదవులను మన చిత్రాల టైటిల్స్‌లో చూస్తుంటాం. ఇటీవల హాలివుడ్‌లో తయారయ్యే కొన్ని చిత్రాల టైటిల్స్‌లో "స్పిరిట్యుయల్ అడ్వయిజర్" అనే కొత్త డెసిగ్నేషన్ కనబడుతోంది. అక్కడ జీన్ డిక్సన్ అనే జ్యోతిష్కురాలు స్క్రిప్టును ఎప్పుడు ప్రారంభించాలో, షూటింగ్ ఎప్పుడు మొదలెట్టాలో ముహూర్తం నిర్ణయిస్తుందట. స్క్రిప్టు చదివి తనకు తోచిన సలహాలు కూడా ఇస్తుందట చాలామంది నిర్మాతలు ఆమెను సంప్రతిస్తున్నారు. కెన్నెడీ హత్య ఉదంతం ముందుగా జోస్యం చెప్పినవారిలో ఈమె కూడా ఒకతెయట.

ఇటీవల నాకు ఒక తమిళ మిత్రుని వద్దనుంచి వచ్చిన శుభలేఖలో నాదస్వరం వాయించే విద్వాంసుని పేరుతోపాటు వంటమనిషి పేరు కూడా అచ్చు వెయించడం చూసి చకితుడ్నయ్యాను "ఆ వంట మనిషేది నలభీమపాకమా ?" అని ఆ మిత్రుడ్ని అడిగాను "అవ్వే! ఫండా ంగా వండుతాడు వాడి పేరు వేస్తే ఎక్కువమంది రారని .." అంటూ సవ్వేశాడతను



'మంగళ తోరణాలు'లో పల్లవి, వరలక్ష్మి

## "కలియుగరాముడు"

ఎన్. టి ఆర్, తో "సింహబలుడు" అనంతరం డాక్టర్ డి. వి ఎస్ రాజు సమర్పించే పై తిరుపతి ప్రొడక్షన్స్ వన్నెల చిత్రానికి కె. బాపయ్య దర్శకుడు. డి శ్రీరంగరాజు నిర్మాత.

| | |
|---|---|
| రచయిత | పిక్చర్ క్లయ్ మాక్స్ లో హీరోకు హీరోయిన్'ఆంటీ'గా మారిపోతుంది |
| నిర్మాత | వద్దుబాబోయ్! 'ఆంటీ' క్లయిమాక్స్ మనవాళ్లకు నచ్చదు |



'త్రిలోక సుందరి'లో ఒక దృశ్యం

## సినిమా

### ఇరుగు - పొరుగు

★ మద్రాసుకు సమీపంగా పల్లావరంలో ఉండే ఒక థియేటర్ ఇటీవలే మూసివేయబడింది దాని పేరు 'జనతా' దానికి సమీపంగా త్వరలోనే ఒక కొత్త థియేటర్‌కు ప్రారంభోత్సవం జరగబోతోంది ఈ థియేటర్ పేరు 'ఇందిరా!' ఇది యాదృచ్ఛికమా లేక మరేదైనా సూచకమా?

★ నేషనల్ పార్టీ తరఫున ఫిలిం పరిశ్రమ నుంచి పోటీ చేసేవారందరికీ డిపాజిట్లు పోవడమే కాకుండా వాళ్ళ మార్కెట్ వేల్యూకూడా పడిపోవడం తథ్యం!" ఇది రణధీర్‌కపూర్ అభిప్రాయం

★ ఇటీవల తమిళనాడులోని కరయూరులో ఎడతెరపిలేకుండా కుంభవృష్టి కురిసింది నవంబర్ 22న అక్కడి కమల్ థియేటర్లో 'అమ్మ ఎవరికైనా అమ్మ' తమిళ చిత్రం చివరి ఆట అనంతరం వర్షం మరింత తీవ్రరూపం దాల్చినందువల్ల ప్రేక్షకులెవ్వరూ థియేటర్ వదలి బయటకు వెళ్లలేక లోపలే కూర్చుండిపోవలసివచ్చింది — మహిళలతోసహా చాలామంది ఆ రాత్రంతా తమ సీట్లలోనే కునుకుతీశారుకూడా విశేషమేమిటంటే — ఆ ప్రేక్షకుల సౌకర్యార్థం హాలులో దీపాలుగాని, పంకాలుగాని ఆఫ్ చేయలేదు థియేటర్ యజమానులు ప్రశంసించవలసిన విషయమే ఇది

★ పాకిస్తాన్‌లో స్మగ్లర్‌లకు సాధారణంగా కొన్ని మాసాల కారాగార శిక్ష విధిస్తారు ఐతే, ఇటీవల ఒక థియేటర్‌లో బ్లాక్‌లో టిక్కెట్ల అమ్మకాన్ని అరికట్టలేని ఒక థియేటర్ యజమానికి 30 వేల అపరాధంతోపాటు ఏడాది కఠిన శిక్ష విధించారు మరో చోట థియేటర్ యజమానికి స్పృహ తప్పేవరకు కొరడా దెబ్బలు శిక్ష విధించారు

★ "తాఖత్" హిందీ చిత్రాన్ని నిర్మించే రాజ్‌గ్రోవర్ ఉదయ్‌పూర్‌వద్ద కొన్ని ఔట్‌డోర్ దృశ్యాలు చిత్రీకరించడానికి నిశ్చయించి, సెప్టెంబర్ 2 నుంచి 20 వరకు షెడ్యూల్ వేసుకున్నాడు అప్పుడు వర్షం కురవటం మొదలెట్టేసరికి తన ఆరాధ్యదైవం సాయిబాబాను ప్రార్థించాడట ఏర్పాలు లేకుండా చేయమని అలాగే ఆ తేదీల్లో వర్షం కురవలేదట కాని, బాధాకరమైన విషయమేమిటంటే — సుస్తీ చేసినందువల్ల నాయిక పర్వీన్‌బాబీ మాత్రం షూటింగ్‌లలో పాల్గొనలేకపోయిందట "నాకీ సంగతి ముందుగా తెలిసివుంటే, ఆమె దేహారోగ్యం గురించి కూడా మా సాయిబాబాను ప్రార్థించి ఉందునే!" అని వాపోయాడట ఆ నిర్మాత ఆయన్ని ఒకరు "మీరు తీసే చిత్రం 35 ఎం ఎం లోనా, 70 ఎం ఎం లోనా?" అని అడిగితే, "35 ఎం ఎం లోనే తీస్తున్నాను కాని, ఖర్చులు మాత్రం 70 ఎం ఎం లో అవుతున్నాయి!" అని జవాబిచ్చాడట

# 3 నెలలు వచ్చిన తర్వాత, పాలు మాత్రం యిస్తే చాలదు



## డాక్టర్లు సిఫార్సు చేస్తారు



# ఫారెక్స్®

## మీ పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

**డాక్టర్లు ఫారెక్స్ సిఫార్సు చేస్తారు! ఎందువల్ల?**

ఎందుకంటే, ఇది మీ పాపాయి ఘన ఆహారం తీసుకోవడం ప్రారంభించే సమయంలో అతడి అవసరాలను తీర్చే సంపూర్ణ సంతులిత ఆహారం. పాపాయి సున్నితమైన జీర్ణకోశానికి సరిగ్గా తగిన ఆహారం.

**ఫారెక్స్ ఏ విధంగా పాపాయికి తగిన సంతులిత ఆహారం?**

ఫారెక్స్ మెదడు, శరీరం పెరుగుదల కోసం తగినన్ని సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను, శక్తి కోసం కార్బోహైడ్రేట్లను, దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళు పెరిగేందుకు తగినంతగా కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి అందిస్తుంది. అన్నిటి కంటె ముఖ్యంగా, పాపాయి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ అందజేస్తుంది.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు?**

ఈ వయస్సులో పాపాయికి నమలడం అలవాటు కావాలి. లేకపోతే నమలకుండా మింగివెయ్యడం వల్ల కడుపు నొప్పి వచ్చి అతడి పెరుగుదల దెబ్బ తినవచ్చు.

అంతే కాకుండా, 3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా సున్నితంగానే ఉంటుంది. అందుకే మామూలు ఘన ఆహారాలకు బదులు అతడికి ప్రత్యేకంగా తయారు చేయబడిన—అంటే సులభంగా జీర్ణమయ్యే—పిల్లల ఘన ఆహారం అవసరం.

**'పెద్దలు తినే' ఆహారాన్ని ఎప్పటినుంచి ఇవ్వవచ్చు?**

పాపాయి మొదటి సారిగా తప్పటడుగులు వేసినప్పుడు అతడు పెద్దలు తినే ఆహారాన్ని తీసుకోగలుగుతాడు. కొంచెం ఆలోచించి, మీ పాపాయి తినేవాటన్నిటిలో ఫారెక్స్ కలిపి ప్రేమగా పెట్టండి.

ఇప్పుడు అదే శ్రేష్ఠమైన ఫారెక్స్ కొత్త 400 గ్రాముల డబ్బాలో వస్తోంది.




## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-2-233 TL

# క్రొత్తగా! వేడివేడి వడ్డనలకు ఇగ్లూ హాట్‌ప్యాక్, వండి నాలుగు గంటలైనాసరే ఎంతో కమ్మదనము




ఎంతసేపైనాసరే, 4 గంటలదాకా అప్పటి కప్పుడు వండినట్లు తాజాగా వేడిగా పొగలొస్తూ, రుచిగా కమ్మగా వుంటాయి.

**కాలము-ఇంధనము ఆదా.**

ఇగ్లూ హాట్‌ప్యాక్ వాడితే తిరిగి వేడిచేసి వడ్డించే అవసరంలేదు. ఆ రోజులు పోయినాయి. ఎంతో తీరిక వుంటుంది. ఖర్చు తక్కువగా వంట అవుతుంది. సాధారణంగా తిరిగి వేడిచేస్తే ఆహారంలో సత్తువపోతుంది.

ఇగ్లూ హాట్‌ప్యాక్ సుప్రసిద్ధమైన జనరల్ స్టోర్సులలో కావలసిన సైజులో లభిస్తుంది. ఇవ్వాళే ఇగ్లూ హాట్‌ప్యాక్ ఇంటికి తీసుకు వెళ్ళండి. మీకన్నీ లాభాలే. ఇంకా ఎంతో తీరిక కూడా!

**ఇదే నిదర్శనము!**

ఈ ప్యాక్‌ను రెండు నెలలపాటు వుపయోగించి పరిశోధించి, మద్రాసులో పాకశాస్త్రమునకు సంబంధించిన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్యాటరింగ్ టెక్నాలజీవారు చెప్పినది గమనించండి:
"ఇందులో వేడి నిల్వశక్తి చాలా బాగా వుంటుంది తాజాతనము ఎంతమాత్రము చెడదు... 8 గంటల తరువాత కూడా రుచి ఏమీ తగ్గదు. ఇవి చాలా సమర్థవంతమైనవి."

**మళ్ళీ వేడిచేయడం అంటూ వుండదు:**

ఇప్పుడు వంట త్వరగా చేసుకోండి. కూరలైనా, పులుసైనా, అన్నమయినా సరే, క్రొత్తగా వచ్చే ఇగ్లూ హాట్‌ప్యాక్‌లో పెట్టి మూతపెట్టండి.

IGLOO hotpack

మెటోప్లాస్ట్‌వారి తయారీ

మెట్టూర్ బియర్డ్‌సెల్ లిమిటెడ

OBM 4897/TG

డిస్ట్రిబ్యూటర్లు:

| కోస్టల్ ఆంధ్రప్రదేశ్: | తెలంగాణా: |
| --- | --- |
| ఇండియన్ ట్రేడ్ కార్పొరేషన్, | మెస్సర్స్ కృష్ణా ఏజన్సీస్, |
| 11-37-25, చిప్పడివారి వీధి, విజయవాడ-1. | 22-4-477, ఎటెబార్ చౌక్, హైదరాబాదు-500002. |

# ప్రాక్టీసు పెట్టిచూడు

(14వ పేజీ తరువాయి)

మంచం ఓక్కేస్తారు. ఈ ప్రాక్టీసా ఇంకా కొన్ని సంవత్సరాలు పట్టేలా ఉంది మెరుగు కావాలంటే! మన ఆర్థిక సమస్యలు తీరాలంటే– మీరు యీ దేశాన్ని విడిచి...'

'విమలా' అంటూ ఉద్రేకంగా అరిచేగు తను. 'నేను జన్మభూమిని విడిచి– యింకో దేశానికి వెళ్ళాలా. దేశం నా మీద వేలు ఖర్చుపెట్టి నన్నో డాక్టర్ని చేసిందిఎందుకు? నా దేశ ప్రజలకు నా చదువు ఉపయోగపడాలని ఏ ఉద్దేశంతో నన్ను డాక్టర్నిగా తయారు చేసిందో ఆ ఉద్దేశానికి భంగం అయే విధంగా నేను ఏన్నడూ సంచరించను.'

విమల తన్ను పసివానిలా చూస్తూ 'మీ బాధను నేను అర్థం చేసుకున్నాను. కాని మీరు మీ చుట్టూ ఉన్న మీ వాళ్ళ బాధను అర్థం చేసుకోండి. మీ మీద కొన్ని బాధ్యతలున్నాయండీ.

ఆ బాధ్యతలు నెరవేరడానికి నెలకి వేలూ మిమ్మల్ని సంపాదించమనటంలేదు. నెలకి కొన్ని వందలు సంపాయిస్తే చాలు. మీ కుటుంబాన్ని మీరు ఆకాశంలో నడిపించనియక్కరలేదు భూమ్మీద ఉంచుతేచాలు.

మీరు యీ దేశాన్ని విడిచివెళ్తే నాకు సంతోషం అనుకుంటున్నారేమో? కాదు అయినా వెళ్ళమంటున్నాను' విమల నోట మ్మాట మాట రాలేదు.

తన దగ్గరగా జరిగి తన గుండెల మీద వొరిగి పోయింది.

ఆమె తలరాస్తూ–ఆమె అన్న మాటల్ని ఆలోచించసాగేడు. తనకు ప్రస్తుత పరిస్థితుల్లో యింకే కర్తవ్యం స్ఫురించటంలేదు. ఇన్ని రోజులనించీ ఉన్న ప్రాక్టీసు కూడా యీ నెలరోజులనించీ అపాయంలో పడింది. తనకు రెండు గజాల దూరంలో యింకో డాక్టరు క్రొత్తగా తెరిచేడు. అతను తనలా అయిదేళ్ళూ చదవలేదు. కొంత డబ్బు ఖర్చు పెట్టి ఆర్. ఎం. పీ డిగ్రీ తీసుకున్నాడు. ఏదో ఫ్యాక్టరీలో క్లార్కుగా ఉద్యోగం చేస్తూ సాయంత్రాలు పార్టుటైంగా డిస్పెన్సరీ పెట్టుకున్నాడు. అతను యింజక్షనూ మందూ– పిల్లలకి రూపాయన్నరకి యిస్తున్నాడు– పెద్దవాళ్ళకు రెండు తీసుకుంటున్నాడు. తన దగ్గరకొచ్చే వాళ్ళలో సగం అక్కడికే వెళుతున్నారు. 'అతను రూపాయన్నరా, రెండు తీసుకుంటుంటే – మీరు నాలుగు తీసుకుంటారేంటి?' అంటూ తన దగ్గరికి వొచ్చేవాళ్ళలో కొందరు అడుగుతూనే ఉన్నారు.

యీ ప్రజకు చదువుకున్న డాక్టరికీ డబ్బిచ్చి డిగ్రీ తెచ్చుకున్న డాక్టరికీ భేదం తెలియదే?

తనకు వొచ్చే జనమే తక్కువ అందులో కొందరు అతని దగ్గరకు మళ్ళిపోతూన్నప్పటినించీ తను దిగులుగా ఉంటున్నాడు.

పోని తన యీ ప్రాబ్లెమ్స్ హరనాథ్‌తో చెబుతామంటే అతని యింటి పరిస్థితే సరిగలేదు. అతని పెరాలిటిక్ తండ్రి ఎన్నో కాంప్లికేషన్సుతో తీసుకొని తీసుకొని వొక పదిరోజుల క్రిందటే పోయేడు.

తను మనస్సు విప్పి మాట్లాడుకొని గుండె భారం తీర్చుకొనేందుకు వొక మనిషి అయినా దొరకటంలేదే.

ఇవాళ భరించ శక్యంగకుండా – రేపు ఆలోచించలేనంత భీభత్సంగా రోజులు తయారయేయి.

ఇలాంటి పరిస్థితుల్లో విమల తన ఆత్మస్థైర్యాన్ని చెదరగొట్టుకోకుండా– తనకు సలహా యిస్తూంది. ఆమె యిచ్చే అర్హత సంపాదించుకుంది.

కారు మబ్బుల్లా తన మనస్సులో గుమిగూడిన ఆలోచనలు 'సరే' అన్న మాటతో తొలగిపోయేయి.

విమల తనలో యింకా దగ్గరిగా వొదిగిపోతూ 'యీరోజు పేపర్లో యిరాన్‌లో డాక్టర్లు కావాలనీ ఎడ్వర్టయిజ్‌మెంట్ పడింది. మీరు అప్లయి చేయండి. అదృష్టం బాగుండి దొరికిందంటే – అన్ని ఖర్చులూ వాళ్ళే భరించి తీసుకువెళ్తారట.'

'రేపే అప్లయి చేస్తాను' అన్నాడు తను.

* * *

అనుకున్నదాని కంటె తొందరగా వొచ్చేసింది తన టిక్కెట్టు. ఆ రోజే తన ఫ్లయిట్.

తను యీ దేశంవిడిచి వెళ్ళిపోతున్నానని విమల పొద్దులు అయినా వొచ్చింది పుట్టినింటినించి.

కలవ వలసిన వాళ్ళందర్నీ కలిసి తను హరనాథ్‌ను కలిసేందుకు వెళ్ళేడు. తను క్లీనిక్ పెట్టిన వీధిలోకి వొచ్చి వొక్కసారి

తను ఖాళీచేసిన మడిగెను చూసేడు.

గతం జ్ఞాపకాలుగా వొచ్చింది. తన కళ్ళ నించి జలజలా నీరు కారింది.

తను ఆ వీధికి దూరంగా హరనాథ్ యింటివైపు నడిచేడు. తను హాస్పిటల్నీ హరనాథ్కి ఫోన్ చేయడం నించి అతను క్లినిక్లో ఎదురు చూస్తున్నాడు తనగురించి.

అతని గురించి పేషంట్లు విదురు చూస్తున్నారు అతని గదిలోకి వెళ్ళగానే గది తలుపులు మూసేస్తూ కాఫీ సిగరెట్లు యిచ్చి 'గురూ వెళ్ళిపోతున్నావన్న మాట'

'తప్పేటట్లు లేదు హరీ!'

'అక్కడ లైఫ్ బాగుంటుందని విన్నాను'

'నేను లైఫ్ గురించి వెళ్ళటం లేదు.' అతని కళ్ళముందు విమల, తల్లీ, తండ్రి, సీతా— వీళ్ళు మెదిలేరు. 'చిన్న అవసరం గురించి చాలా దూరం, నాకు కాని స్థలానికి వెళ్తున్నాను' అని— భారమైన తన గొంతును తేలికగా చేసుకుంటూ 'హరీ చిన్న వెంట నించీ నీతో వొక విషయం మాట్లాడాలి అని ఉంది. మాట్లాడడానికి పర్మిషన్ యిస్తావా?'

'షూట్ యిట్ అవుట్'

'శోభ గురించి హరీ! ఆమె రానురాను విలా తయారవుతూందో చూసేవా?'

'తెలుసు కానీ నన్నేం చెయమంటావ్? ఈ ప్రాక్టీస్ నాకు ఒక్క గంట తీరుబడి యివ్వటం లేదు'

'ప్రాక్టీస్ని దూషించి యిది నీ తప్పు కాదని నిన్ను నీవు సమాధాన పరచుకుంటున్నావ్. కాని యిందులో నష్టపోయేది నువ్వే హరీ పొద్దస్తమానం పనిచేస్తూ యిందులోంచి ఏం బావుకుంటున్నావ్?— వొక్క డబ్బు తప్ప. అది నీకు పుష్కలంగా ఉందే. మరి విందుకీ చాకిరీ?'

'నన్నేం చేయమంటావ్? నా చేతుల్లో ఏం లేదే. ప్రయివేట్ ప్రాక్టీషనర్ అంటే తన సుఖాలూ తన భార్య సుఖాలూ— అన్నీ త్యజించి యీ నాలుగు గోడలలో బంది అయిపోయిన వాడనీ అర్థం.'

'అలా అర్థం మనం చెప్పుకుంటున్నాం హరీ! ప్రయివేట్ ప్రాక్టీషనర్ యిలా ఉండాలనీ విక్కడరాసి ఉంది? చూపించు. జీవితం మొన్ననే మొదలు పెట్టి యింకా, యిరవై మూడేళ్ళయినా నిండకుండా వొంటరితనంతో విసిగిపోయి తన కోరికలు చంపుకోవడంకోసం బిక్కు మార్గాన్ని వెతుక్కుందే- శోభ- అలా ప్రయివేట్ ప్రాక్టీషనర్ భార్య కావాలని విక్కడయినా రాసి ఉందా? నీ భార్య అయినంత మాత్రంచేత -శిక్షంతా ఆమెకా?'

'అయితే యిప్పుడేం చేయమంటావ్?'

'నీ డిస్పెన్సరీ సమయాన్ని మిగతా ఆఫీసుల్లా మార్నింగ్ పదినించి అయిదు దాకా.',

'సరే అలానే చేస్తాను. అయినా టైము సరిపోదే. ఇప్పుడు ప్రొద్దుట విమిది నించి రాత్రి పది దాకా చేస్తుంటేనే యింకా పని పూర్తికావటంలేదే- అప్పుడు—'

'నువ్వు పూర్తి చేయటంలేదు హరీ— అందుకే కావటంలేదు. నీవు నీవొక్కడి నించీ పని పూర్తి కాదనుకుంటే నీ చేతి క్రింద నీకు అవసరం ఉన్నన్ని డాక్టర్లని పెట్టుకో. హౌస్ సర్జరీ పూర్తవగానే— ఉద్యోగాలు లేక — తమ జీవనం గురించి క్లినిక్కులు అంటూ పెట్టుకుని— ప్రాక్టీసు రాక- విందుకు యీ కోర్సుకొచ్చేమా? అని బాధపడుతూన్నారే? అలాంటి వాళ్ళకు గవర్నమెంటు ఉద్యోగం వొచ్చేదాకా

# ప్రాక్టీసు పెట్టిచూడు

ప్రైవేట్ ప్రాక్టీషనర్స్ అసిస్టెంట్లలా పెట్టుకుంటే వాళ్ళకు ఎంత మేలు చేసిన వారవుతారో- నేన మాటల్లో చెప్పలేను.'

'సరే సుదర్శన్, నీవు చెప్పినట్టే చేసేందుకు ప్రయత్నిస్తాను' అని 'భోజనానికి రాకూడదూ.'

'వద్దు టైములేదు' అంటూ లేచేడు.

'శోభని కలవకుండా వెళ్ళిపోతావేంటి?'

'మళ్ళీ వచ్చినపుడు కలుస్తాను' అని తను కరచాలనం చేసి వెళ్ళిపోయేడు.

* * *

తను ఫారిన్ వెళుతున్నానని అందరికీ చాలా గర్వంగా ఉంది.

అందరి కళ్ళలో తన అంతస్తు అప్పుడే పెరిగిపోయింది కాని వీళ్ళందరికీ తెలీదు తను ఎందుకు పోవలసి వస్తూందో? వీళ్ళకి తెలిస్తే - తనకు యింత గౌరవం దొరికేదా?

తనో వి. ఐ. పి అయేవాడా?

నేను కనీస అవసరాలు కూడా సంపాయించుకోలేని అసమర్థుణ్ణి. నా కంటే మీరే గొప్ప నాకు లేనిది మీకు ఉంది. మీకున్నదాన్ని నేను ఇక్కడ సంపాదించుకోలేక - వాటిని పొందేందుకు దూరంగా వెళుతున్నాను - అంతరంగం ఘోషిస్తున్నా పెదాలు మాత్రం నవ్వుతూనే ఉన్నాయి.

టైము అయింది. ఇక తను మెట్లెక్కాలి.

అందరూ తలెత్తి తన్ను గర్వంగా చూస్తూంటే తను తల దించుకుని, సిగ్గుతో ఒక్కొక్క స్టెప్ మెట్టు ఎక్కసాగేడు.

(అయిపోయింది)

## అంకితం

కళాకారుడు, ప్రియమిత్రుడు
డా॥ రాజారాం హెబ్బార్ వారికి
ప్రేమతో
— రచయిత శ్రీరంగం

## వారఫలం

## 11-1-1980 శుక్రవారం మొదలు
## 17-1-1980 గురువారం వరకు

**మేషం :—** తాత్కాలికంగా మారే గ్రహాలలో చాలా మార్పులు వచ్చాయి. రాశికి 'దశమంలో' రవి స్థితి. షష్ఠమంలో 'శని' పంచమంలో కు—గు—రా హువులు. అనేకవిధాల వ్యాపారంలో, అనేక మార్పులు చేయనున్నారు. అట్టి పద్ధతి లాభదాయకం. విస్తారమైన వ్యాపారం, హోదాగల ఉద్యోగలాభం గలదు. స్త్రీలకు :— శుభకార్యాలోచనలు, నెరవేరేమార్గమున్నది.

**వృషభం :—** మీ ప్రయత్నాలలో అనుకూలత చెప్పవీలులేదు. ఉద్యోగ వృత్తులలో ఎంత జాగ్రత్తగా ఉంటే, అంతమంచిది. పొరపాట్లు దొర్లకుండా జాగ్రత్తపడండి. విరోధివర్గం, అన్ని రంగాలలో తలయెత్తే మార్గమున్నది. మంచిగా, శాంతంగా, ధైర్యంగా అన్నింటినీ ఎదుర్కోవండి. వారఫలం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు :— వైద్యవిషయంగా ఉన్నత విద్యలో ప్రవేశమున్న వారికి శుభం.

**మిథునం:—** నూతన పరిచయాలు లభించనున్నవి. కొందరకు స్త్రీ మూలకమైన యిబ్బందులుండ గలవు. చాలమందికి వ్యాపార రీత్యాగాని, వృత్తి మూలకంగాగానీ, క్రయవిక్రయాలలో గాని, అనుకూలత కనిపించవచ్చు. మీ ప్రయత్నాలలో ఉత్తమ ఫలప్రాప్తి. స్త్రీలకు :— నూతన విషయాలలో, అనుకూలత సంభవించగలదు.

**కర్కాటకం:—** మీకు ఆర్థికలాభము గలదు. ఆస్తి వ్యవహారాలలో, శుభకార్యప్రస్తావనలో అనుకూలత గలదు. కళారంగ ఖ్యాతి, ద్రవ్యలాభం, మొదటి మూడు దినాల్లోనే కనిపిస్తుంది. పరిష్కార విషయంలో, అనానుకూలం జరుగుతుందేమో అని భయపడే మీకు అనుకూలతే కల్గుతుంది. మేలు కోరేవారు యిల్లు చేరుకుంటారు. బంధువర్గీయులతో శుభప్రస్తావనలుంటాయి స్త్రీలకు .— కొందరకు విదేశీ ప్రయాణసూచన, వృత్తిలో ప్రఖ్యాతి సమకూడుతుంది.

**సింహం:—** మీకు ఏలోపం ఈవారం చెప్పడానికి వీలులేదు గాని, ఆరోగ్య విషయంలో జాగ్రత్తపడాలి అని చెప్పకవదలలేను. దైవపుణ్యకార్యాలు నెరవేరుతాయి. గృహసంబంధ చికాకులుంటాయి. కాలం కానినాడు మొనగాడు కూడా ప్రకాశించలేడు అన్నట్లు మీకు అడుగడుగునా, వ్యాపార వృత్తులలో అంతరాయా లుంటాయి. స్త్రీలకు :— ఆరోగ్య లోపం, కంటికి సంబంధించిన వ్యాధి, రుగ్మతకనిపిస్తుంది.

**కన్య:—** మీకు అదృష్టకాలమే. అయినాకొన్ని చిక్కుల నుండి మీరు బయటపడవలె. ముఖ్యంగా గృహసంబంధమైన, స్త్రీసంబంధమైన చిక్కులుంటాయి. ధనం సంపాదించాలి, అని అనేక ఆలోచనలుంటాయి. ఇంకా అనుకూలకాలం కాదనిగుర్తించండి. వయసు మళ్ళిన వారికి సాంఘిక, రాజకీయ చిక్కులకు తోడు, ఆర్థిక ఆరోగ్యలోప మున్నది. స్త్రీలకు :— ఉద్యోగ, వ్యాపార, వృత్తులలో సామాన్య ఫలం గల వారం.

**తుల:—** దూరప్రయాణమో, లేక దరిదాపులలో ఉన్న గ్రామానికో మీరు ప్రయాణం చేయవలసి ఉన్నది. అలా జరిగి, ఒకానొక ముఖ్య విషయంలో మీరు లాభం పొందనున్నారు. చాలమందికి కళారంగంలో, భారీ వ్యాపార విషయంలో లాభదాయకం. సంతాన శుభ కార్య నిర్వహణకు అనుకూలమైన వారం వ్యయసూచన గలదు గాన, జాగ్రత్త పడదగునని జ్యోతిష భావం. స్త్రీలకు :— సర్వానుకూలమైన వారం

**వృశ్చికం:—** మీ వృత్తి, మీ రాశికి దశమంలోగల 'గురుగ్రహం' వలన మూడుపువ్వు లాఱుకాయలుగా విస్తరిస్తుంది. ఆశించిన లాభం అందుకోగలరు. అందరకు అనుకూలంగా మసలుకున్నారనే పేరు తెచ్చుకోగలరు. పట్టుదలతో, సాధించే మీ ప్రయత్నాలు, ద్రవ్యాదాయంతో, మీకు అనుకూలించనున్నది. ఆరోగ్యం తృప్తిగా ఉంటుంది. లోగడ సాధించిన వాగ్దానాలు నెరవేర్చగలరు. స్త్రీలకు :— సాంఘిక, రాజకీయ, ఆర్థిక రంగంలో అనుకూలత గలదు.

**ధనుస్సు:** గతవారానికన్నా మీకు అన్ని రంగాలలో అభివృద్ధి గుడదంటాను. సంఘసేవలో, పేరు వృద్ధినందగలదు. ఆదాయమున్నది. ఇకరాదని ఆశ వదిలిన సౌఖ్యం, హఠాత్తుగా అందుతుంది. అన్ని విధాల మేలు సమకూడి, ఒకవేళ జాయింటువ్యాపారమైతే అనుకూలత కల్గి, సుఖశాంతు లుంటాయి. స్త్రీలకు :— మానసికానందం కన్నా ఏం కావాలి. అందమైన వస్తుసేకరణతో, ఆనందప్రదాయకంగా వారం జరిగిపోతుంది.

**మకరం:—** మీ వ్యాపారం వృద్ధి చెందగలదు. దూరదేశ వ్యాపారం గల వారికి, అనుకూలంగా ఉండే వారం. మీ శక్తి సామర్థ్యాల వలన అనేకరీతుల మేలు పొందనున్నారు. రాజ్యాంగ విషయంలో, మీకు గల గౌరవ వలన, సాంఘికంగా మీరు చేసే సేవవలన, మీ పేరు ప్రఖ్యాతులతిశయించ నున్నది. పురాణాది కాలక్షేపాలలో గౌరవ గల వారికి, గాయకులకు, పుస్తకవిక్రేతలకు అనుకూల ఫలప్రాప్తి గలదు. స్త్రీలకు :— గాత్రసంగీతంతో కాలక్షేపం చేసే వారికి, రచయిత్రులకు మేలుగలదు.

**కుంభం:—** లాభం, ప్రఖ్యాతి, గౌరవం, సాహిత్య కృషి, రచనావ్యాసంగం, కళారంగ ప్రగతి, ఈరాశి జాతకులకు, చెప్పదగిన వారం. ఆర్థికంగా మేలు పొందగలవారం. ఆరోగ్యం హాయిగా ఉంటుంది. అన్ని విషయాల్లో ప్రశాంతి చిక్కుతుంది స్త్రీలకు: ఉద్యోగంలో, వ్యాపార రంగంలో గౌరవగల వారికి ధనలబ్ధి గలదు.

**మీనం:—** అనేక విధాల మీ వ్యాపారంలో బాధ్యతా నిర్వహణగావించ వలసిన వారం. ఆశించిన ఫలితం అందుకొంటారు. వైద్యవృత్తిలోని వారికి మంచి ఆదాయం లభిస్తుంది. 'ఉత్తరాభాద్ర' నక్షత్ర జాతములకు, స్త్రీ పురుషాదులకు, ధనలాభమున్నది. స్త్రీలకు :— ఆరోగ్యలోపము తప్ప, అధికవ్యయం తప్ప, మరేవిధంగా నష్టముండదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి





# వంటలు

## రవలడ్డు

కావలసినవి : రవ – 2 కప్పులు, పంచదార – ఒక కప్పు, నిండు కొబ్బెర కోరు – ½ కప్పు, జీడిపప్పు, కిస్‌మిస్ మొదలగునవి. నెయ్యి లేక డాల్డా ½ కప్పు. పాలు అరకప్పు

చేయు విధానము : కొబ్బెరికోరు మూకుడులో వేసి కొద్దిగా వేగించుకొనవలెను అది తీసి వేరుగా వుంచి, అదే మూకుడులో జీడిపప్పు మొదలగునవి రెండు స్పూనులు నెయ్యితో వేగించి కొబ్బెర తురుములో చేర్చవచ్చును.

మళ్ళీ అదే మూకుడులో నెయ్యి వేసి రవ ఎర్రగా వచ్చువరకు వేగించవలెను. అందులో పంచదార వేసి ఒకటి, రెండు సారులు కలిపి దింపవలెను. ఇప్పుడు బాగా వేగించిన రవలో కొబ్బెర జీడిపప్పు చేర్చి పాలు జల్లవలెను. అన్ని పాలు ఒకసారి వేయకూడదు. కొద్ది కొద్దిగా జల్లుకుంటూ వుండలు చేయవలెను. వుండలు రాకన్న మరికొద్ది పాలు చేర్చవచ్చును. అప్పుడు వుండలుచేసి ఒక పెద్ద ప్లేటులో కాని కాగితము మీద కాని పెట్టుకొనవలెను. బాగా చల్లారిన వుండలు గట్టిపడును తరవాత డబ్బాలో పెట్టవచ్చును.

ఈ విధముగా చేయుటకు రవ, పంచదార దంచనవసరములేదు కనుక సులభము.

– గొల్లపూడి సుగుణారావు.

## లవంగచతురలు

కావలసిన వస్తువులు : కొబ్బరికాయ – 1, పంచదార – అర కె జి., గోధుమ పిండి – అర కె జి, యాలుకులు - 6, లవంగములు, నూనె లేక డాల్డా.

చేయు విధానము : కొబ్బరికాయ చిప్పలను కోరి దానికి పంచదారను చేర్చి బాణలిలో వేసి సన్నని సెగ మీద పెట్టాలి. నీరంతా ఇగిరిపోయి పొడి పొడిగా వచ్చాక యాలుకులు పొడికొట్టి కలపాలి గోధుమ పిండిని జల్లించుకొని కొంచెం నూనెని, డాల్డాగాని వేసి పూరీల పిండి మాదిరి కలిపి ఒక అరగంట నాననివ్వాలి. తర్వాత నిమ్మకాయ సైజు ఉండచేసి, దానిని పూరీవత్తి అందులో కొబ్బరి, పంచదార మిశ్రమాన్ని కొంచెము వేసి పూరీని చతురసముగా మడిచి పైన లవంగమును గుచ్చాలి అలా అన్నింటిని చేసి ఉంచకోవాలి బాణలిలో నూనెగాని డాల్డాగాని పోసి బాగా కాగిన తర్వాత చేసి ఉంచుకొన్న లవంగ ఛతురలను నూనెలు బట్టి మూడు, నాలుగు వేసి దోరగా వేయించి తీసికోవాలి. చల్లారిన తర్వాత డబ్బాలో జాగ్రత్త పెట్టకోవాలి. 4, 5 రోజుల వరకు నిలువ వుంటాయి.

– ఎమ్. రాజి

## ఎన్నికల సంక్రాంతి

నిన్నటిది సంక్రాంతి
మొన్నటిది సంక్రాంతి
ఇపుడే కల సంక్రాతిరా!
మేకవన్నె పులులకు అంత్య విక్రాంతిరా
కోడిపందెము లేదు
కోలాటముల రవు,
మనిషి మనిషే పుంజా
ఎదురెదురై రంజు.
పాతని జియ్యరూ,
పొలిమేర గగెద్దూ,
ఊరి వెలపల తిరిగిన
బుడబుక్కలోడూ,
అందరూ మననెత్తి
కెక్కి అభ్యర్థులై
రంగద్దుకొన్నారయ్యో!
రంగవేస్తున్నారు
ఓటరూ! జాగత్త
లోటు కన్పించిందా!
పాత రామాయణమె
ఓటరూ! జాగ్రత్త
నోట గుడ్డలు కుక్కి
కాటేసి పోతారు.

— రంగకవి.






మీ చర్మానికి
సహజమైన
సంరక్షణ-
**వేప్**
సబ్బు

మీ శరీర ఛాయను క్షీణింపజేసే అపరిశుభ్రమైన వానిపై వేప్ సబ్బు బహు చాతుర్యంగా పనిచేయగలదు. వేప్ నురుగు మీ చర్మంలోని సహజమైన నూనెలను హరింపక, చిద్దు, మురికిని, సూక్ష్మమైన మరకలను నిర్మూలింపగలదు.

**కేరళ సోప్స్ & ఆయిల్స్ లిడ్.**
(ఒక కేరళ ప్రభుత్వ సంస్థ)
కాలికట్

EDS KS 2871 TEL

## సీటుకు ఆరున్నరమంది :

నామినేషన్ పత్రాల ఉపసంహరణ డిశంబరు 13వ పూర్తి కావడంతో రాష్ట్రంలో లోక్‌సభకు ఎన్నికల కదన రంగంలో 271 మంది మిగిలారు. 42 స్థానాలకు దాదాపు చెరి ఆరున్నర మంది పోటీ అన్నమాట. రాష్ట్రంలో పోటీ ఎక్కువగా ఉన్న స్థానం సికిందరాబాద్. దీనిలో 17మంది పోటీచేస్తున్నారు. వీరిలో ముఖ్యంగా పేర్కొనదగిన వారు పి. శివశంకర్ (కాం.ఇ) వై. శివరామశాస్త్రి (లోక్‌దళ్), డాక్టర్ ఎం. శ్రీధరరెడ్డి (జనతా), చుండి జగన్నాథం (ఇండిపెండెంట్), శివశంకర్ మాజీ పార్లమెంట్ సభ్యుడు. శివరామశాస్త్రి ప్రముఖన్యాయవాది. మంచివక్త. అత్యవసర పరిస్థితిలో బాధలకు గురయి జనతాలో చేరి, జనతా చీలినప్పుడు లోక్‌దళ్ పక్షం వహించారు. చుండి జగన్నాథం గాంధి సిద్ధాంతవాది. వోటర్ల మండలి పక్షాన పోటీచేస్తున్నారు. పత్రికా రచయిత. చక్రం అనే పత్రికకు సంపాదకుడు. అలనాడు ఏ. ఐ. సి. సి ని ఊపిన వాడు. మద్రాసుకుట్ర కేసులో శిక్ష పొందిన వీరాగ్రేసరుడు. డాక్టర్ శ్రీధరరెడ్డి ఎం. ఎ, పి. హెచ్. డి. పట్టభద్రుడు. జనతా పక్షాన పోటీ చేస్తున్నారు. హైదరాబాద్ నియోజకవర్గం నుండి పోటీ చేస్తున్న ఏడుగురిలో పేర్కొనదగినవారు ఎం.ఎ. సుబ్బమ్మ (ఇండిపెండెంట్), ఎ బి. ముత్యాలరావు (కాంగ్రెసుఅర్స్), ఎ నరేందర్ (జనతా), కె. ఎస్. నారాయణ (కాంగ్రెసు ఇ), రాజారామశాస్త్రి (ఇండిపెండెంట్). సుల్తాని వెంకటసుబ్బమ్మ రాష్ట్ర విధాన సభ ఎన్నికలలో సత్తుపల్లి నియోజకవర్గంలో అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావుకు విరు

# హైదరాబాద్ నోట్‌బుక్

ద్ధంగా ప్రముఖకవి కాళోజీనారాయణరావు కోసం ముమ్మరంగా ప్రచారం చేసిన సంఘ సేవకురాలు. తాము పోస్టర్లు ప్రింటు చేయబోమని, గోడలు ఖరాబు చేయబోమని, ఆమె తరపున శ్రీ జగన్నాథం తరపున ప్రచారం చేస్తున్న వోటర్ల మండలి కన్వీనర్ శ్రీ సుల్తాని వెంకటరామమూర్తి తెలిపారు. ముత్యాలరావు మాజీ కేంద్రమంత్రి రాజారామ్‌శాస్త్రి రాజ్య పరిషత్తు సభ్యుడు. ఎన్నికల రణరంగాలలో అతడనేక యుద్ధముల నారియు తేరిన పుణ్యమూర్తి. యావద్భారత రాజకీయ పక్షాల దృష్టితో చూచినపుడు పెద్ద పార్టీల మధ్యనే పోటీ అనడం చెప్పనక్కరలేదు. ఈ సందర్భంలో పాతసామెత 'వ్రతం చెడ్డా ఫలందక్కాలి, కులంచెడ్డా కూడుపుట్టాల' —అనేది జ్ఞాపకం వస్తుంది. కొందరు ఎన్నిపార్టీలు మార్చినా టిక్కెట్టు దక్కించుకొన్నారు. కాని మేడం లక్ష్మీకాంతమ్మలాంటివాళ్లకు పార్టీ మారినా, టిక్కెట్టు దొరకలేదు.

## మృదంగ కోవిదుడు ఎల్లా :

అబ్బ ! ఎన్నాళ్లకెన్నాళ్లకు విన్నాము శివతాండవ మృదంగ ధ్వనులు. రెండు దశాబ్దాల కిందట అనుకుంటాను రవిశంకర్‌కు పక్కవాద్యంగా తబలా వాయించే శ్యామప్రసాద్ కాబోలు మూడు గంటలు తబలా సోలో వాయించాడు మద్రాసులో. ఆ సోలోలో రెండు గంటలు శివతాండవం వినిపించాడు. ఇదిగో శివుడు హిమాలయాల నుంచి కిందికి దిగివస్తున్నాడు. ఇదిగ కన్నెర్ర జేశాడు. అని చిన్న చిన్న వ్యాఖ్యలతో అత్యంత మధుర భయానకంగా, మధుర శోకంగా, మధుర భీభత్సంగా వాయించాడు. ఆటు తర్వాత ఇప్పటికి విన్నాము మృదంగ కోవిదుడు మిత్రుడు ఎల్లా వెంకటేశ్వరరావు శివతాండవ మృదంగ గంభీరధ్వనులు. ఎల్లా వెంకటేశ్వరరావు ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో నిలయమృదంగ విద్వాంసుడు. చిన్ననాటి నుంచే మృదంగ వాదనంలో ఆసక్తి చూపుతూ కొత్త రీతులు అలవరచుకొన్నారు. 15సంవత్సరాల వయస్సులోనే మృదంగ మహాసభలో 'అఖిలభారత ప్రథమ' బహుమతి సంపాదించి, అప్పటి రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రశంసలు పొందారు. ఏషియన్ బ్రాడ్‌కాస్టింగ్ యూనియన్ యాజమాన్యాన ఏర్పాటు చేసిన అంతర్జాతీయ హోసో బుంకా బహుమతి (1000 డాలర్లు) ఎల్లా వెంకటేశ్వరరావు రచించిన శివతాండవం, మృదంగ ధ్వని కావ్యానికి లభించింది. ఈ శివతాండవంను మూడు నెలల క్రితం ఇండోనీషియాలోని బలిలో జరిగిన ఏషియా పసిఫిక్ బ్రాడ్‌కాస్టింగ్ యూనియన్ సమావేశంలో ప్రాంతీయ శాస్త్రీయ సంగీతం పోటీకి పంపారు ఎల్లా. ఈ బహుమతి భారత దేశానికి లభించడం ఇదే మొదటిసారి. డిశంబరు 11వతేదీన కళాభవన్‌లో జరిగిన సన్మాన సభలో ఆయన ఈ శివతాండవం ఎలా రూపొందించింది ఆయన వివరిస్తూ, ఒకసారి నాగార్జునసాగర్‌లో ముఖ్య గాయకుడు రానందున తానొకడే మృదంగం వాయించవలసి వచ్చినదని, దానితో ప్రోత్సాహితుడై శివతాండవం పూబాడా విశ్వనాదాలు, ఉమా, కాళికా, ప్రళయ, ఓంకారాదులు మేళవించి రూపొందించానని అన్నారు. తర్వాత దీనిని ఆకాశవాణి ఇండోనీషియాకు పోటీ కోసం పంపింది. ఎల్లా వెంకటేశ్వరరావు ఇదివరకే పెక్కు సన్మానాలు, బిరుదాలు, పొందారు. తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన విద్వాంసులు. ఆయనకు గొప్ప భవిష్యత్తు వుంది. ఉత్తరోత్తర అఖండ విశ్వఖ్యాతి పొందగలరనడంలో సందేహం లేదు.

## ఉపశ్రుతి :

''ఏమిటి సార్, కొండను పొట్టేలు ఢీకొన్నట్టు పోటీ పడుతున్నారేం?'' అనడిగాను ఇండిపెండెంటుగా పోటీ చేస్తున్న ఒక ఎన్నికల ఏకాంగ వీరుణ్ణి. ''పోటీ చేయకుండా బాధపడడం కంటే, పోటీ చేసి బాధపడడం మంచిది కదండి. ఇంతకూ భర్తృహరి అనలేదా అన్నాడు, 'యత్నే కృతేయది నసిధ్యతి కోత్ర దోషః' అని'' అని ఆ వీరుడు సమాధానమిచ్చాడు.

— తిరుమల రామచంద్ర

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

"స్వర్ణోత్సవ సంవత్సరము 1930 – 1980"

# ఉత్తరాలు

## ముఖచిత్రం

చిదిమిన పాల్‌గారు పసిడి మోముతో చిరునవ్వులతో చిత్రింపబడిన అంతర్జాతీయ బాలలసంవత్సరపు 28 12 79 సంచిక అత్యంత ఆకర్షణీయముగానున్నది. స్వయంవరం సీరియల్ అదిలోనే ఆకట్టుకుంది. ప్రచురించిన రెండుకథల్లో తల్లి—ఒక మనసున విరిసిన మల్లి అనే కథ నాకునచ్చింది.

చుక్కా శివ, తెనాలి.

* * *

అంతర్జాతీయ బాలల సంవత్సరం యింకా కొన్ని రోజులలో ముగిసి పోతుండగా, ఈ బాలల సంవత్సరానికి గుర్తుగా ఈ వారం (28 12.79) ఈ ఏడాది వీరులు రేపటి పౌరులు ముఖచిత్రం ప్రచురించినందులకు మా అభినందనలు.

పి. వి. రామనాధరావు (మధిర)

* * *

అంతర్జాతీయ బాలల సంవత్సరం పూర్తయిన సందర్భంగా ఈ వారం (28.12.79) ప్రచురించిన పత్రిక(బాలల) ముఖచిత్రం చూడ ముచ్చటగ ఉంది. కథలలో తల్లి—ఒక మనసున విరిసిన మల్లి కథ చాల బాగుంది. రెండే కథలను ప్రచురిస్తున్నారు. కథల సంఖ్య పెంచవలసిందిగా మా మనవి.

టి. వి. శ్రీనివాసరావు, టి. సత్యప్రసాద్, అండలూరు, భీమవరం (ప. గో. జిల్లా.)

* * *

28.12.79 నాటి ఆంధ్రపత్రిక ముఖచిత్రం బాలల సంవత్సరంలో బాలలకు బాలల సంవత్సరానికి వీడ్కోలు ఇస్తున్నట్లుగా ప్రచురించినట్లు వుంది. బాలల ముఖాభినయాలు ఆకర్షణీయంగా ముద్దు ముద్దుగా చూడటానికి చాల బాగున్నాయి.

వై. హేమసుందర్‌రావు, హేమాబిందు (డోర్నకల్)

* * *

అరుణా ఇరానీ ముఖచిత్రంతో వెలువడిన ఈవారం (7.12.79) ఆంధ్ర సచిత్ర వారపత్రిక అత్యంత మనోహరంగా ఉన్నది. ప్రాక్టీసు పెట్టి చూడు అనే సీరియల్ చాలా బాగుంది.

ఇక పోతే జి.వి. జి.గారి సినిమా విశేషాలు చాలా బాగున్నాయి.

నందిగామ మణిపాల్‌కృష్ణ [హైదరాబాద్]

* * *

జయప్రద ముఖచిత్రంతో వెలువడిన 21—12—79 నాటి ఆంధ్రపత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ఈ సంచికలో ప్రచురించిన వయసు— మనసు, మురుగుల జత కథలు రెండూ చాలా బాగున్నాయి.

కె. జి. హేమలత, సుషమరాణి, ఎల్. పి. చంద్ర [కుప్పం]


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA